బెర్ట్రాండ్ రస్సెల్

# అణు యుగంలో ప్రపంచ శాంతి

అనువాదం :

వి. నారాయణరావు



యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్టణము - సికిందరాబాదు - మద్రాసు

*F - 12*
*First Print*
*Dec. 1960*
*2500 copies*

# COMMON SENSE AND NUCLEAR WARFARE

*By*
BERTRAND RUSSEL

*Translated by*
V. NARAYAN RAU



**Price 1-25 nP.**




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సువారి
“ఇంటింటా స్వంత గ్రంథాలయం” ప్రణాళిక
చందాదారులకొఱకు ప్రత్యేక ప్రచురణ.

HINDU PRESS
MASULIPATAM

# తొలిపలుకు

కమ్యూనిస్టు దేశాలకూ, ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలో సభ్యులయిన దేశాలకూ, ఏ వర్గంలోనూ చేరని దేశాలకూ — అందరికీ ఆమోదయోగ్యమైన మార్గాల ద్వారా శాంతిని సాధించడానికి అవకాశం ఉన్నదని చూపించాలనే లక్ష్యంతో ఈ పుస్తకం వ్రాశాను. ఇందులో ఒక్క మాట కూడా పక్షపాత భావంతో చెప్పినది లేదని నా నమ్మకం. ప్రాచ్య పాశ్చాత్య పక్షాల రాజకీయ ఆర్థిక వ్యవస్థలలోని గుణగుణాలను గురించి నా అభిప్రాయాలు చాలా సార్లు ప్రకటించాను. కాని, అణుయుద్ధ ప్రమాదాలను గురించిన చర్చలలో ఆ విషయాలకు తావు లేదు. ఇప్పుడు చేయవలసిన పని - ఏదో ఒక రాజకీయ సిద్ధాంతం ప్రకారం ఆలోచించవలసినదని అర్థించడం కాదు. ప్రపంచ జ్ఞానంతో, వివేకంతో ఆలోచించమని అర్థించడం. నా లాగ ఆలోచించేవారు చెప్పే వాదనలు ఒక పక్షంకన్నా ఇంకొక పక్షం వారికి, లేక మితవాద దృక్పథం కలవారికన్నా వామ పక్ష భావాలు కలవారికి, ఎక్కువ ఆమోదకరంగా ఎందుకు కనిపించాలో నాకు తెలియడం లేదు. ఇది మానవు లందరికీ చేసిన అభ్యర్థన; మానవజాతి మనుగడను కాంక్షించే వారందరికీ ఇది సమానంగానే వర్తిస్తుంది.

# ఉపోద్ఘాతం

అణుయుద్ధం రాకుండా వారించాలనే లక్ష్యంతో చేసే ఉద్యమాలను—యూరప్ దేశా లన్నిటిలోనూ వామ పక్షోద్యమాలుగానో, అధిక సంఖ్యాకులు సహించ లేని ఏదో ఒక 'ఇజం' చేత ప్రేరేపించబడ్డ ఉద్యమాలుగానో జమకట్టడం ఆశ్చర్యకరంగానూ, నిరాశాజనకంగానూ ఉన్నది. అణుయుద్ధాలయెడల ఉన్న వ్యతిరేకతను ఈ విధంగా భావించకూడదు. అంటువ్యాధులను నివారించ డానికి చేయవలసిన ఆరోగ్యరక్షక చర్యలను గురించి భావించినట్టుగానే – దీనిని గురించికూడా భావించాలి. అణుయుద్ధంవల్ల వచ్చే ప్రమాదం మానవజాతి కంతటికీ వచ్చే ప్రమాదం. అందుచేత ఈ విషయంలో భేదభావాలు ఉండ వలసిన అవసరంలేదు. ప్రపంచ వ్యాప్తమైన అణుయుద్ధాన్ని వారించాలని కాంక్షిస్తున్నవారికి—ఏదో ఒక జాతికిగాని, మరొక జాతికిగాని, ఒక వర్గానికిగాని, మరొక వర్గానికిగాని, ఒక ఖండానికిగాని, మరొక ఖండానికిగాని, ప్రత్యేకంగా లాభం చేకూర్చాలనే పక్షపాతం లేదు. కమ్యూనిజంలో కాని, ప్రజాస్వామ్యంలోకాని ఉన్న గుణదోషాలతో వాళ్ళకు ఏమాత్రమూ నిమిత్తం లేదు. అణుయుద్ధాలకు వ్యతిరేకంగా జరిగే ప్రచారంలో ఉపయోగించే వాదనలు – ఇటు ప్రాచ్యవర్గానికీ, అటు పశ్చిమవర్గానికీ, ఎటూ చేరని వారికికూడా, సమాన బలంతో వర్తిస్తాయి. అవి ఏ వర్గా

నికీ ప్రత్యేక ప్రయోజనాన్ని చేకూర్చాలనే భావంతో కాకుండా, మానవజాతి కంతటికీ సంబంధించినవి.

ఈ సమస్య నంతటినీ ఏళ్ళతరబడిగా వస్తున్న ప్రాబల్య స్పర్థలతో ముడిపెట్టడం చాలా ఘోరమైన దురదృష్టం. ఈ స్పర్థలు పరమ తీవ్రంగానూ, అత్యావేశకరంగాను పరిణమించి, చివరకు అతిస్పష్టమైన సాధారణ విషయాలను అర్థం చేసుకునే వివేకాన్ని కూడా లోపింప జేస్తున్నవి. అణ్వాయుధాలవల్ల ఉత్పన్నమైన క్రొత్త చిక్కులనుగురించి వివేకంగా ఆలోచించాలంటే, ఈ విషయాన్నంతటినీ ఇంకొక క్రొత్త పద్ధతిలో పరిశీలించడం నేర్చుకోవాలి. ప్రబలమైన ఒక అంటువ్యాధిని ఎదుర్కొనే పద్ధతిలో—అందరికీ వచ్చిన సమష్టి ప్రమాదంలాగ—దీనిని భావించాలి.

దీనిని వివరించడానికి ఒక ఉదాహరణ చెపుతాను. బెర్లిన్ నగరంలోఉన్న కుక్కలన్నిటికీ హఠాత్తుగా పిచ్చెక్కిందనుకోండి. తూర్పుబెర్లిన్‌లోను, పశ్చిమ బెర్లిన్ లోను ఉన్న అధికారులు తక్షణం సమావేశమై, ఆ కుక్కలను సంహరించే ప్రయత్నాలు చేస్తారనే విషయంలో ఎవరికైనా సందేహం ఉన్నదా? ''అలా కాదు, ఈ కుక్కలను వదలేద్దాం. ఇవి మనవాళ్ళకన్నా అవతలి పక్షంవాళ్ళనే ఎక్కువ మందిని కరుస్తాయని మా నమ్మకం. పోనీ, వాటిని పూర్తిగా వదిలెయ్యకపోయినా, అవసర క్షణంలో వదలడానికి వీలుగా పగ్గాలుకట్టి వీధులలో తిప్పుదాం. ఒకవేళ శత్రువులు వాళ్ల పిచ్చికుక్కలను మనమీదకు వదిలితే వెంటనే ప్రతీకారచర్య

చేయవచ్చును.'' అని వాదించేవారు ఎవరేనా ఉంటారనుకోను. ''అవతలి పక్షంవాళ్ళు తమ కుక్కలను చంపుతారని నమ్మడానికి వీలులేదు. అందుచేత ప్రతిక్రియ కోసమైనా మనకు తగినన్ని పిచ్చికుక్కలు ఉండాలి,'' అని తూర్పుబెర్లిన్ అధికారులుకాని. పశ్చిమ బెర్లిన్ అధికారులుగాని వాదిస్తారా? ఇదంతా చాలా పిచ్చిగా ఉంటుంది. రాజకీయాలలో విజయసాధనకు పిచ్చికుక్కలు ఉపకరణంగా పనికివస్తాయని వివేకవంతు డెవ్వడూ భావించడం లేదు. కాబట్టి, ఎవరికీ ఇలాంటి ఆలోచన తట్టదు. కాని, దురదృష్టవశాత్తు, అణ్వాయుధాలు అట్టి ఉపకరణాలౌతాయని భావిస్తున్నారు. అందుచేతనే వాటి విషయమై విజ్ఞతతోను, వివేకంతోను. ఆలోచించలేక పోతున్నారు.

ఇంతకన్నా చక్కని ఉదాహరణ ఇంకొకటి చూద్దాం. 14వ శతాబ్దింలో పూర్వార్ధగోళం అంతా 'బ్లాక్ డెత్' అనే ప్లేగువ్యాధి ముమ్మరంగా వ్యాపించింది. పశ్చిమ యూరప్‌లో ఇంచుమించు సగంమంది జనులు మరణించారు. తూర్పు యూరప్‌లోనూ, ఆసియాలోనూకూడా ఇంచుమించు అంత జననష్టమూ కలిగింది. ఇప్పుడుగాని అంత ప్రమాదంవస్తే, అన్ని నాగరిక జాతులూకలిసి దానిని ఎదుర్కొంటాయి. ఈ వ్యాధివల్ల మనకు కలిగే నష్టంకన్నా మన శత్రువులకే కలిగే నష్టమే ఎక్కువలే అని ఎవరూ వాదించరు. ఒకవేళ అలా ఎవరైనా వాదించినా. వాడు రాక్షసుడంటాముకాని మనిషి అనం. ఇప్పుడు అణుయుద్ధంవల్ల రాబోయే ప్రమాదం అప్పటి ప్లేగువ్యాధివల్లకాని, అట్టి మరేవ్యాధివల్లకాని,

యింతవరకు ఎన్నడూ మానవజాతికి కలుగలేదు. ఉత్తర అట్లాంటిక్ రక్షణవ్యవస్థలోని దేశాలు కాని, వార్సాసంధి రాజ్యాలు కాని, తటస్థరాజ్యాలు కాని — ఏవైనాసరే— ఈ సమస్యకు సమానబాధ్యత వహించవలసి ఉంది. క్రొత్తగా 'బ్లాక్ డెత్' వంటి ప్లేగువ్యాధివస్తే ఎట్టిబాధ్యత వహించాలో, సరిగ్గా అట్టిబాధ్యతనే అందరూ వహించవలసి ఉంది. ప్రాక్ పశ్చిమ దేశాల రాజ్యతంత్రజ్ఞులు ఈ విషయాన్ని గ్రహిస్తే, ఇంతవరకూ అసాధ్యంగా కనిపిస్తూ ఉన్న గడ్డు సమస్యలన్నీ తీరిపోతాయి. ఉభయపక్షాలూ నావాదనను సమానంగా అంగీకరిస్తారని నేను భావిస్తున్నాను. వివేకంతో ఈ సమస్యను పరిశీలిస్తే అణ్వాయుధాలవిషయంలో తప్పని సరిగా ఏకీభావం కలుగుతుంది. ఇందుకోసం గొప్పగొప్ప ఆదర్శాలను అవహింపచేసుకోనక్కరలేదు. ఎవరి జాతీయ స్వార్థం వారు చూచుకోవాలని అర్థిస్తేచాలు.

# విషయసూచిక

ఒకటి

# నిరంతర యుద్ధసన్నద్ధ విధానం

అణుయుద్ధం రాకుండాఉండి, ప్రస్తుత రాజకీయ విధానాలుమాత్రం ఇలాగే కొనసాగుతూ ఉంటే, ప్రపంచ పరిస్థితులలో ఎలాటి మార్పులు జరగడానికి అవకాశం ఉందో ఈ అధ్యాయంలో పరిశీలిస్తాను. అమెరికా జాతీయ ప్రణాళికసంఘం వారు తయారుచేయించిన ఒక అద్భుత మైన నివేదికలో * ఈ విషయాన్ని పర్యాలోచించారు. ఈ నివేదిక యుద్ధాలకు వ్యతిరేకంగా జరిగే ఉద్యమాలకు సంబంధించిన వాళ్లెవరూ తయారుచేసింది కాదు. వాస్తవ విషయాలను, తత్పర్యవసానంగా సంభవించడానికి అవకాశం ఉన్న సంఘటనలనూ, మానవసాధ్య మయినంత నిష్పక్షపాతబుద్ధిలో పరిశీలించి, వాటిని సమగ్రంగా చిత్రించాలని అనుకున్న వారు కొందరు తయారుచేసింది మాత్రమే. ప్రస్తుత కాలంలో ఇంతత్వరలో పెద్దయుద్ధం ఏదీ రాబోవడంలేదని నేను అనుకుంటున్నట్లుగానే ఈ నివేదిక తయారుచేసిన వారు కూడ భావించినప్పటికీ, ప్రస్తుతవిధానాలు మాత్రం ఇలాగే కొనసాగితే ఏక్షణమైనా యుద్ధం వచ్చిపడే ప్రమాదం ఉందన్న విషయాన్ని వీరు గుర్తించారు. "యుద్ధప్రమాదం

---

* *1970 Without Arms Control*: Implications of Modern Weapons Technology; by NPA Special Project Committee on Security Through Arms Control; Planning Pamphlet No. 104; May 1958, Washington D. C.

నిరంతరం ఉండడమే కాకుండా, శాంతికి మార్గాంతరం ఏమీ లేకుండా యిలా కాలం గడుస్తూ ఉంటే యుద్ధావకాశం క్రిమంగా ఎక్కువై. చివరకు నిశ్చయంగా యుద్ధం వస్తుంది,'' అని ఈ నివేదికలో చెప్పారు. అంటే యిప్పటి విధానాలు ఇలాగే కొనసాగుతుంటే యుద్ధభయం కూడా కొనసాగుతూంటుందనీ, వాస్తవ విషయాలు తెలుస్తున్న కొద్దీ ఈ భయం ఇంకా ఎక్కువ అవుతుందనీ అర్థం అన్నమాట. భయం ఎక్కువ అవడంతో ఆయుధాలు ఎక్కువ కావడం, అందుకు ఖర్చులు ఎక్కువకావడం, అందువల్ల సామాజికవ్యవస్థ మరింత కఠినం కావడం, క్రమక్రమంగా స్వేచ్ఛ పరిమితం కావడం జరుగుతాయి. ఇందువల్ల కలిగే అపారభారాన్ని సహించవలసిందని ప్రజలను ఒప్పించాలంటే– నిరంతరం వాళ్ళకు పరరాజ్యాల యెడల భయాన్ని, అసహ్యాన్ని కలిగించడంతప్ప గత్యంతరం లేదు. ఏళ్ళు గడుస్తున్నకొద్దీ, సాంకేతిక అభివృద్ధి ఎక్కువై, ఇంకా కొత్త ఆయుధాలు తయారవుతాయి. అందువల్ల యుద్ధంవస్తే రాబోయే వినాశనం మరీ భయంకరం అవుతూ ఉంటుంది. ఇటువంటి సందర్భాలలో వివేకవంతులైన వారంతా సురక్షితమైన శాంతి కావాలని కోరుకుంటారు. కాని, అధిక సంఖ్యాకులకు మాత్రం శత్రువుయెడల పిచ్చిభయం పుట్టి, భయంకరమైన నిరంతర ఆందోళన కలిగి, ఆ భయంకన్నా యుద్ధమే మేలులే అనిపించే స్థితి వస్తుంది.

ఆయుధాలకోసం ఇప్పుడు పెడుతున్న ఖర్చు ఇంతకు ముందు చేసిన ఖర్చులకన్నా ఎన్నోరెట్లు ఎక్కువగా ఉంది. పైన చెప్పిన నివేదిక ప్రకారం అమెరికా దేశం సంవత్సరానికి 45 బిలియనుల డాలర్లు సైన్యంకోసం వ్యయం చేస్తోంది.

"అమెరికా జాతీయసంపదలో సుమారు నూటికి పదిపాళ్ళు సైనిక వ్యవహారాలకోసం ఖర్చు అవుతోంది. రష్యాలో నూటికి పదిహేను పాళ్లు ఈ విధంగా వ్యయమవుతోందట." ప్రపంచ పరిస్థితులు ఇంతకన్నా చెడకుండా, బాగుపడకుండా, ఇలాగే కొనసాగినా, 1970 నాటికి 1500 నుండి 2000 బిలియన్ల డాలర్ల వరకూ ఆయుధాలకోసం ఖర్చుపెట్టవలసి వస్తుందని అంచనాలు వేస్తున్నారు. కాని ఈ అంచనా చాల తక్కువ. ఎందుచేతనంటే. ఈ లోపున జరిగే కొత్తపరిశోధనల వల్ల ఇంకా అనేకం అతి ఖరీదైన ఆయుధాలు తయారుచేయవలసి వస్తుంది. ఏ కొత్త పరిశోధనలు జరుగుతాయో సరిగ్గా చెప్పలేము. కాని కొత్త పరిశోధనలు జరుగుతాయని మాత్రం నిశ్చయంగా చెప్పగలము. అందులో కొన్ని చాలా చవకయినవి కూడా కావచ్చు. ఉదాహరణకు : సూక్ష్మక్రిములు. సూక్ష్మక్రిములను శత్రుప్రాంతాలపై జాగ్రత్తగా విస్తరింపజేయడానికి అనువైన సాధనమే కాని కనిపెట్టగలిగితే—— మిసిసిపి నదినీ, ఓల్గానదినీ పూర్తిగా విషపూరితం చేసి, ఆ నదులనీటిని త్రాగి బ్రతికే ప్రాంతాల నన్నిటినీ చాలా తక్కువఖర్చుతో నిర్మానుష్యం చేసివేయవచ్చును. కాని మున్ముందు కనిపెట్టబోయే కొత్త విధానాలన్నీ యింత చవకగా వినాశనాన్ని

కలిగిస్తాయని అనుకోలేము. ఉదాహరణానికి : వాతావరణాన్ని అదుపులో పెట్టుకోవడం అనే పద్ధతి ఒకటి చూడండి. లప్రాటాలోని తత్వశాస్త్రజ్ఞులు తమమీద తిరుగుబాటు చేసిన రాష్ట్రాలపై తమ ద్వీపపునీడ ఎప్పుడూ పడుతూ ఉండేట్టుచేసి, వాళ్ళని చిమ్మచీకటిలో ముంచి లొంగదీసుకున్నారు. మనకుకూడా అనతికాలంలోనే శత్రుప్రాంతాలలో అతివృష్టిగాని, అనావృష్టిగాని కలిగించడమో లేక ఆప్రాంతపు ఉష్ణోగ్రతను పంట లేవీ పండడానికి వీలు లేనంతగా తగ్గించివేయడమో సాధ్యం కావచ్చు. ధ్రువప్రాంతాలవద్దనున్న మంచును కరిగించివేసి ఆ నీటితో సముద్రమట్టంకన్నా ఆట్టే ఎక్కువ ఎత్తులేని ప్రాంతాల నన్నిటినీ ముంచివేయడం కూడా సాధ్యం కావచ్చు. కాని అలాంటి పద్ధతులు ఇంత త్వరలో సాధ్యం కావు. కాకపోయినా అంతకన్నా ప్రమాదకరమైనవీ, అంతకన్నా ఖరీదయినవీ బోలెడు మార్గాలు యుద్ధోన్మాదుల చేతిలో సిద్ధంగా ఉన్నాయి.

ఆకాశంలోకి కృత్రిమ ఉపగ్రహాలను పంపించడంవల్ల బడిపిల్లలకు, ప్రభుత్వాధినేతలకు ఆనందం కలిగింది. పశ్చిమ రాజ్యాలవారికిమాత్రం పాపం! మొదటి ఉపగ్రహం రష్యావారిది కావడం చాల ఖేదదాయకమైంది. ఉపగ్రహాలు ఇంకా యిప్పటికి చిన్నవిగానే ఉన్నాయి. కాని అవి అలాగే ఉండవు. వాటిలో ఇప్పుడు మారణాయుధాలు ఏవీ లేవు. అయినా ఉపగ్రహాలలో మారణాయుధాలు పెట్టి పంపించే రోజు త్వరలోనే వస్తుందని అన్ని దేశాల సైనిక తంత్రజ్ఞులూ ఆశిస్తున్నారు. ఎలక్ట్రానిక్ కంప్యూటర్ల సహాయంతో ఈ

ఉపగ్రహాలను ఆకాశంలోకి ఎగిరించి, సరిగ్గా శత్రుప్రాంతాల మీదనే, అనుకున్న సమయానికి బాంబులవర్షం కురిపించవచ్చు. ఇటువంటి ఆయుధాలు తయారు చేయడానికి చాలా ఖర్చు అవుతుంది. కాని, ఇరుపక్షాలవారూ "అవతలవాళ్ళకి అలాంటివి ఉంటే మనకూ ఉండవలసిందే" నని వాదిస్తారు.

ఉపగ్రహాలతో మాత్రమే ఈకథ ఆగిపోదు. ఏదో ఒకరోజున చంద్రమండలాన్ని చేరగల రాకెట్టును ఏదో ఒక పక్షంవాళ్ళు పంపించగలరు. కొద్దిరోజులలోనే చంద్రమండలంమీద మానవుల్ని దింపడం సాధ్యమవుతుందని అంతా గట్టిగా నమ్ముతున్నారు. యువకులు చదవటంకోసం వ్రాసిన ఒక రష్యన్ పుస్తకాన్ని నేను ఈమధ్య చదివాను. అలాంటి పుస్తకాలు అమెరికాలోకూడా ఉన్నాయనడంలో నాకేమీ సందేహం లేదు. ఆ పుస్తకంలో చంద్రమండలంలో మనుషులు నివసించాలంటే సాధించవలసిన పరిస్థితులను గురించి వివరించారు. కొద్దికాలంలో భూమిమీద ఒకచోట మచ్చుకి, చంద్రమండల వాతావరణాన్ని సృష్టించడం సాధ్యం అనికూడా ఆ పుస్తకంలో సూచించారు. ఆ పుస్తకపుధోరణి యుద్ధాలకు పూర్తిగా వ్యతిరేకమైన ధోరణి. భౌతికమైన ఆటంకాలను అతిగమించి, శాస్త్రసహాయంతో సాహసంగా విజయం సాధించడం ఎడల అనురాగాన్ని ఎక్కువచేయడం ఈ పుస్తకంయొక్క ప్రయోజనంగా కనిపిస్తుంది. కాని, అంతరాళ యాత్రలకోసం ప్రభుత్వాలు ఇంతడబ్బు వ్యయం చేయడానికి ఇంత ఉదాత్తమైన కారణా లున్నాయని నేను అనుకోను. సాయుధ

దళాలను పర్యవేక్షించే శాసనసభా సంఘం ఎదుట జనరల్ పుట్ సాక్ష్యంఇస్తూ చంద్రమండలంపై అమెరికా విమాన దళంవారు రాకెట్లస్థావర మొకదానిని ఏర్పాటుచేసుకొన నున్నారనీ, చంద్రమండలంపై వాతావరణం లేదుకాబట్టీ, చంద్రమండలానికి ఆకర్షణశక్తి తక్కువ కాబట్టీ, అక్కడ నుండి రాకెట్లను తక్కువ శ్రమతో భూమిమీదకి పేల్చవచ్చు ననీ చెప్పాడు. భూగోళంమీది శత్రుదేశాలపై ప్రతీకార చర్యకు చంద్రమండలం చాల అనుకూలమైన స్థావరం కా గలదని ఆతడు ప్రకటించాడు. చంద్రమండలంనుండి అమె రికా ఎదురుదాడి చేయలేకుండా చేయాలంటే, రష్యా— భూమిమీదనున్న అమెరికన్ స్థావరాలపై దాడి మొదలు పెట్టేకన్నా, ఒకటి రెండు రోజులుముందుగా చంద్రమండలం పైనున్న అమెరికన్ స్థావరాలపై దాడి మొదలుపెట్టవలసి ఉంటుంది. చంద్రమండలంపైనున్న స్థావరాలమీదనే రష్యా మొదట దాడిచేస్తే, ఆ సంగతి అమెరికన్‌లకి రాబోయే ప్రమాదాన్ని గురించి ముందుహెచ్చరికగా ఉంటుంది. ఒకవేళ చంద్రమండల స్థావరాలపై రష్యా మొదటిదెబ్బ తీయకపోతే, భూగోళంమీదనున్న అమెరికాదేశం అంతా సర్వనాశనం అయిపోయినా, చంద్రమండలంనుంచి వారు రష్యామీద ఎదురుదెబ్బ తీయవచ్చు. అమెరికా విమాన దళ పరిశోధనశాఖ సహాయకార్యదర్శి రిచర్డ్ ఇ. హార్నర్ ఈ అభిప్రాయాన్ని బలపరచాడు. ఇప్పుడు అణ్వాయుధ బలం ఇరుపక్షాలకు సమానంగా ఉండడంవల్ల ఏర్పడిన ప్రతి ష్టంభన చంద్రమండలంమీద అమెరికా స్థావరాలను ఏర్ప

రచుకోవడంవల్ల అంతమవుతుందని అతని అభిప్రాయం. రష్యాకూడ చంద్రమండలంపైన సైనికస్థావరాలు ఏర్పాటుచేసుకునే అవకాశం ఉందని ఈ ఇద్దరు సైనిక తంత్రజ్ఞులూ ఒప్పుకోవడానికి మొదట ఇష్టపడలేదు. ఇది ఆశ్చర్యకరమే అయినా, సైనిక తంత్రిజ్ఞ స్వభావ సాధారణమైనదే! ఒక పక్షానికి సాధ్యమైనదేదో రెండవ పక్షంవాళ్ళకికూడ సాధ్యం అయ్యేదేకదా! అందుచేత ఇలాంటి పథకాలు కొనసాగితే— తత్ఫలితంగా చంద్రమండలం మీాద కూడా యుద్ధం జరుగుతుంది. అమెరికాకు సాధ్యం అయ్యేదేదో, చంద్రమండలం మీాద రష్యాకుకూడా సాధ్యం అవుతుందని చివరికి జనరల్ పుట్ అంగీకరించాడు. కాని దానికి అతడు సూచించిన మార్గాంతరం ఏమిటంటే—అమెరికా కుజగ్రహాన్ని, శుక్రగ్రహాన్నికూడా ఆక్రమించుకోవాలని! ఆ రెండూ రష్యాకు అందుబాటులో ఉండవని అతని ఆశ. ఈ విచిత్ర ఊహాగానం జనానికి తెలియవలసినంత విరివిగా తెలియలేదు. ఐ. యఫ్. స్టోన్ వారపత్రికలో 1958 అక్టోబరు 20వ తేదీ సంచికలో ఇవి ప్రకటింపబడి ఉండకపోతే, నాకూ తెలిసేవి కావు. రష్యాప్రభుత్వానికి యిలాంటి పథకాలు ఉన్నట్లు నేను చూడలేదుకాని, ఇలాంటివి ఉన్నాయని నిస్సంశయంగా అనుకోవచ్చు.

యుద్ధతంత్రిజ్ఞుల పథకాలను చూసేటప్పుడు అసహ్యమూ, భయమూ కలగకుండా ఆపుకోవాలని చాలా ప్రయత్నిస్తాను. విశ్వంలో ఏదో ఒక మూలనున్న గ్రహంలోనున్న అల్పప్రాణుల కీచులాటలు గగనవీధిని కలుషితం

చేస్తూండటంచూస్తూంటే, ఈపథకాలను వేసేవాళ్ళు అపవిత్రులని అనిపిస్తుంది. అమెరికాలో జరిగే ఎన్నికల్లోగాని, రష్యాలో పార్టీ వివాదంలోగాని చంద్రమండలంమీద రష్యావారిని అమెరికావారు నాశనం చేశారా లేక అమెరికావారిని రష్యావారు నాశనం చేశారా అనే విషయం చర్చజరిగితే, ఎలాఉంటుందో ఊహించుకోండి. విశ్వాంతరాళంలో మహోన్నత పరిధిలో విహరించే తేజోగోళాలను ఇలాటి పథకాల వల్ల అల్పమానవుల కోపావేశాల క్షుద్రస్థాయికి తీసుకువస్తున్నాము. మన అభిప్రాయభేదాలు వీలున్నంత త్వరలో తగ్గించుకుంటేనే తప్ప, ప్రపంచంలో బలవత్తమ దేశాల ప్రజలూ ఆ దేశాల అనుయాయులూకూడా ఒకరి నొకరు చంపాలనే అభిప్రాయంతో విపరీతంగా ఆయుధాలు తయారు చేయడం కోసం ధనవ్యయం చేస్తూ, చివరకు తినడానికి తిండికూడా చాలని స్థితికి వస్తారు.

ఏది ఏమైనా, ఒక్కమాట మాత్రం నిజం. ఈభూగోళం ఇప్పటి స్థితిలో ఆట్టే కాలం ఉండలేదు. వస్తే యుద్ధం రావచ్చు. అప్పుడు అందరూ గాని, యించుమించు అందరూ గాని, నశించిపోతారు. యుద్ధం రాకపోయినా, విశ్వాంతరాళంలోని గ్రహాలమీద దాడులు జరుగవచ్చు. చంద్రుడు బద్దలై, ముక్కలై కరిగిపోవచ్చు. విషపూరితమైన ముక్కలు వాషింగ్టన్ మీదనో, మాస్కోమీదనో లేక ఏ అమాయక ప్రాంతాలమీదనో పడవచ్చు. విద్వేషమూ, వినాశక భావమూ, విశ్వపరివ్యాప్తములై యుద్ధోన్మాదాన్ని ఇప్పటి భూపరిధులనుదాటి విస్తరింప జేయవచ్చు. ప్రపంచ రాజ

నీతిజ్ఞుల మనస్సులలో, ఇప్పటికైనా, కొంచమైనా, వివేకం ఉదయిస్తుందని కొంత సంశయంతో నయినా ఆశిస్తున్నాను. వివేకరహితమైన అధికార వైపరీత్యం మహాభయం కలిగిస్తుంది. అందువల్ల నిరాశోపహతులైన వారిని నేను నిందించడం లేదు.

కాని, నిరాశ వివేకవంతుల లక్షణం కాదు. మనుష్యులలో భయద్వేషాలకే కాక ఆశాసౌజన్యాలకుకూడా స్థానం ఉంది. ప్రపంచ ప్రజలకు భయవిద్వేషాలవల్ల రాబోయే ఘోరనరకాన్ని ఒకవంక, ఆశాసౌజన్యాలవల్ల వారు నిర్మించుకోడానికి వీలైన స్వర్గధామాన్ని మరొకవంక చూపించగల్గితే—ఆ రెండింటిలో వారికేదికావాలో తేలికగా ఎంచుకోగలరు. అప్పుడు స్వయంబాధితమైన మానవజాతి యింతకు ముందుతరాలవా రెవరూ ఎరుగనంత గొప్ప ఆనందాన్ని సంపాదించుకోగలదు.

రెండు

# అణుయుద్ధం వస్తే

అణుయుద్ధం వస్తే అది ప్రపంచానికి అంత్యదశ అవుతుందని గుర్తించినవారు చాలామంది—అలాంటి యుద్ధం అసలు రానేరాదని తమకి తాము నచ్చజెప్పుకున్నారు. వాళ్ల నమ్మకం నిజమయితే బాగుండునని నేను ఎంతగానో కోరుకుంటున్నాను. కాని, అది నిజంకావాలంటే అగ్రరాజ్యాలు కొత్త విధానాలను అనుసరించడం ఒక్కటే మార్గం. ఇప్పటి విధానాలు ఇలాగే కొనసాగితే అణుయుద్ధం రావడానికి మామూలుగా అంతా అనుకునే దానికన్నా ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. గత యుద్ధాలలో లభించే విజయంవంటి విజయం ఇప్పుడు కూడా లభిస్తుందని ఉభయపక్షాల ప్రధాననాయకులూ విశ్వసిస్తూ ఉండడమే ఈ విపత్కరస్థితికి కారణం. అమెరికన్ జీవన విధానానికి ప్రత్యక్షయుద్ధంకన్నా ప్రచ్ఛన్న యుద్ధమే ఎక్కువ హానికరమని డల్లెస్ ఒక కాంగ్రెసుసంఘం వారిని హెచ్చరించాడు. "ప్రత్యక్షయుద్ధం వస్తే అమెరికా గెలుస్తుంది. కాని, యీ ప్రచ్ఛన్నయుద్ధంలో మాత్రం మనం గెలుస్తామో లేదో నేను చెప్పలేను" అని ఆయన అన్నాడట. 1958 జూన్ 27 వ తేదీని టైమ్సు పత్రికలో పడ్డ మాటలు నేను ఉదహరిస్తున్నాను. ఇది యిలా ఉండగా కృశ్చేవ్ నాకు వ్రాసిన ఒక ఉత్తరంలో ఇలా అన్నాడు :

"మా శత్రువులు మమ్మల్ని ఎంత దుమ్మెత్తిపోసినా సోషలిస్టు దేశాలు నాశనం కావు. అత్యంత పురోగమన శీలమూ, మానవతాభావభావితమూ అయిన కమ్యూనిజము మాత్రం అంతం కానేరదు."

"కమ్యూనిజాన్ని ఆయుధబలంతో నాశనం చెయ్యాలని యింతకుముందు ఎన్ని ప్రయత్నాలు జరుగలేదు!"

"సామ్రాజ్యవాదులే కనక ఇంకొక ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభిస్తే, వారుదాంతోనే మసి అయిపోతారు. యుద్ధాలు లేకుండా మనలేని విధానాన్ని, కొద్ది మంది గుత్తదారుల సౌఖ్యంకోసం లక్షలాది ప్రజలను సర్వనాశనం చెయ్యనిదే నిలువలేని వ్యవస్థను ప్రపంచ ప్రజలు భరించరు."

డల్లెస్‌కీ, కృశ్చెవ్‌కీ కూడా ఈ విశ్వాసంలో అనుయాయులున్నారనీ, తమకు కావలసిన ప్రపంచాన్ని నిర్మించుకోవడానికి అణుయుద్ధం తమకు తోడ్పడుతుందని యిరుపక్షాల అనుయాయులూ విశ్వసిస్తున్నారనీ నాకు తెలుసు. ఈ విశ్వాసం పూర్తిగా పొరపాటని చెప్పడానికి గల కారణాలను ఈ అధ్యాయంలో వివరిస్తాను. ఇట్టి విశ్వాసంవల్ల అణుయుద్ధం వచ్చే ప్రమాదం మరింత ఎక్కువ అవుతుంది. అంతేకాక, యిందువల్ల మనలో మనకి రాజీ కుదరడానికి వీలులేకపోతుంది. ఈ రెండు కారణాలవల్లా యిట్టి విశ్వాసం విపత్కరమైనది.

అణుయుద్ధం ఆరంభం కావడానికి అనేక అవకాశాలున్నాయి. ఏదో ఒక పక్షంనుండి ఆకస్మికమైన దాడివల్ల

ఆరంభం కావచ్చు. లేదా ముందు మామూలు యుద్ధం ప్రారంభ అయి అది క్రమంగా అణు యుద్ధానికి దారితీయ వచ్చు. తాము అణు యుద్ధానికి దారితీయబోమని ఇరు పక్షాలూ ప్రకటించాయి. కాని ఆ ప్రకటనకు కొన్ని షరతు లున్నాయి. ఉత్తర అట్లాంటిక్ రక్షణవ్యవస్థలో ఉన్న ఏ దేశం మీదనైనా రష్యా దాడిచేస్తే, ఆదాడి మామూలు ఆయుధాలతో చేసినాసరే, తాము అణ్వాయుధాలతో సమాధానం చెబుతామని అమెరికా, బ్రిటన్ లు ప్రక టించాయి. అందువల్ల, ఆరంభంలోనయినా అణ్వా యుధాలు వాడకూడదనే ఉద్దేశ్యం రష్యాకు ఉండడానికి అవకాశంలేదనీ, ప్రాక్పశ్చిమ రాజ్యాల మధ్య ఏ యుద్ధమైనా సరే ఆరంభంనుండీ అణుయుద్ధం కావడం తప్పదనీ స్పష్ట పడుతున్నది. అణుయుద్ధంలో మొదట దెబ్బతీసిన వారికే ఎక్కువ లాభం కలుగుతుందన్నమాట నిజం. కాని, ఆకస్మి కంగా జరిగేదాడితోనే యుద్ధం ముగిసిపోకుండానూ, తాము ఎదురుదెబ్బ తీయడానికి అవకాశం లేకుండా ఉండే ప్రమాదం లేకుండానూ, యిటు పశ్చిమపక్షం వాళ్లూ అటు రష్యావాళ్లూ కూడ బహు జాగరూకులై ఉన్నారు. అందుచేత అణు యుద్ధంలో శత్రుపక్షాన్ని నాశనం చేసేశక్తి యిరుపక్షాలకూ సమానంగానే ఉంటుందని మనం అనుకోవాలి.

ఈ వినాశనం ఎంత సంపూర్ణంగా ఉంటుందనేది వివాదాస్పదమైన విషయం. తమ పక్షం యుద్ధంలో కాస్త జంకుతుందని భయపడే ఆశావాదులు కొందరు ప్రపంచం మొత్తంమీద నూటికి 30 మందికన్నా ఎక్కువ చావరనీ,

ఆ మాత్రం నష్టం ఫరవాలేదనీ అనుకుంటున్నారు. కాని, యింతకన్నా ఎక్కువ సహేతుకమైన అంచనాలు వేయడంలో నైపుణ్యమూ, వేయడానికి అవకాశమూ కలవాళ్ళు చేసిన ప్రకటనలు ఇంతకన్నా ఎక్కువ నిరాశా జనకములుగా ఉన్నాయి. ఈ విషయంలో అసలు సంఘటన అయేవరకూ ఏదీ నిశ్చితంగా చెప్పలేము.

సైమింగ్‌టన్ సెనెట్ కమిటీ వారిముందు జనరల్ గావిన్ చేసిన ప్రకటన మొట్టమొదట ఉదహరిస్తాను. ఈ ప్రకటన చేసినప్పటికి జనరల్ గావిన్ అమెరికాలో సైనిక పరిశోధన అభివృద్ధిశాఖకు ప్రధానాధికారి. ఆయనను ఈ విధంగా ప్రశ్నించారు.

"మనం అణు యుద్ధంలో చిక్కుకున్నప్పుడు మన విమానదళం రష్యాపై అణ్వాయుధాలతో దాడి జరిపితే, ఆ సమయంలో రష్యామీద ఆగ్నేయ దిశగా గాలి వీస్తుంటే, జననష్టం ఏ విధంగా జరుగుతుంది?"

జనరల్ గావిన్ యిలా జవాబుచెప్పాడు. "ఇప్పటి అంచనాల ప్రకారం కొన్ని కోట్లమంది చచ్చిపోతారని చెప్పవచ్చు. అయితే వారు ఏపక్షం వారయి ఉంటారనేది-గాలి ఏవైపు వీస్తోందనే విషయంపై ఆధారపడి ఉంటుంది. ఆగ్నేయదిశగానే గాలి వీస్తుంటే జననష్టం చాలవరకు రష్యాలోనే జరుగుతుంది. కొంత జపానులోను, ఫిలిపైన్ దీవులలోనూ కూడా నష్టపడవచ్చు. కాని, గాలి అటునుండి యిటు వీస్తోంటే మాత్రం, జననష్టం పశ్చిమ యూరపులో చాలాభాగానికి వ్యాపిస్తుంది."

ఈ జవాబు అధికారులకు నచ్చలేదు. అయినా, అందు లోని వాస్తవాన్ని మాత్రం వాళ్ళు శంకించలేదు. ఇవి అమెరికా ప్రభుత్వపు అభిప్రాయాలేననీ, వాటిని ఆ సమయంలో ప్రకటించడం అమెరికా ప్రభుత్వానికి యిష్టం కాకపోయినా, జనరల్ గావిన్ వాటిని ప్రకటించాడనీ నమ్మటానికి తగిన కారణాలున్నాయి.

జనరల్ గావిన్ ప్రకటన కన్నా ఎక్కువ ప్రామాణికమైనది—ఫెడరల్, సివిల్,డిఫెన్స్ అడ్మినిస్ట్రేషన్ వారు చేసిన అంచనా (రష్యాలోకూడా యిటువంటి అంచనాలు తయారయే ఉంటాయి). అమెరికామీద 25 కోట్ల టన్నుల శక్తిగల బాంబులు వేస్తే జరగ బోయే నష్టాన్ని వీరు అంచనావేశారు. 1950 లో వున్న జనాభాను (1510లక్షలు) ఆధారంగా తీసికొని చూడగా—మొదటిరోజున 3 కోట్ల 60 లక్షలమంది చచ్చిపోతారనీ, 5 కోట్ల 70 లక్షల మంది గాయపడతారనీ, 60 వ రోజునాటికి 7 కోట్ల 20 లక్షలమంది హతులు, 2 కోట్ల 10 లక్షలమంది క్షతగాత్రులు ఉంటారనీ, యింక 5 కోట్ల 80 లక్షలమంది మాత్రం ఏ దెబ్బలూ తగల కుండా ఉంటారనీ అంచనావేశారు. డల్లెస్ గారి ప్రభుత్వమే ఈ అంచనాలను తయారుచేసింది కాబట్టి, రష్యాలో ఇంత కన్నా ఎక్కువమంది మరణించే పక్షంలో, ఆయన దీన్ని విజయంగానే భావిస్తాడని మనం అనుకోవాలి. ఈ అంచనాలు 1950 వ సంవత్సరపు జనాభాను ఆధారంగా తీసికొని తయారుచేసినవి కాబట్టి, యిప్పుడు పెరిగిన జనాభాకి అను గుణంగా ఇవికూడా పెరుగుతాయి. కాని, సరిగ్గా అప్పటి

పరిస్థితులు ఎలా ఉంటాయో తెలుసుకోడానికి ఉత్తలంకెలు ఉపయోగపడవు. ఏ దెబ్బలూ తగలనివారుగా లెక్కించబడినవారిలో కూడ చాలమంది అటూ యిటూ తిరిగేటప్పుడు అణుధూళివల్ల దెబ్బతింటారు. అదీకాక, చాలా ఆసుపత్రులు, మందుల షాపులు బాంబులవల్ల నాశనమయిపోతాయి కాబట్టీ, చాలామంది నర్సులూ, డాక్టర్లూ మరణిస్తారు కాబట్టీ, గాయపడ్డవారికి తగిన వైద్యసహాయం ఉండదు. రోడ్లు, వార్తా సౌకర్యాలు, నీటిసరఫరా మొదలైనవి నాశనం అయిపోతాయి కాబట్టి, పెద్ద నగరాలలో చావగామిగిలిన కొంతమందినయినా పోషించడం ఇంచుమించు అసాధ్యం అయిపోతుంది. మురికికాలువలు. మరుగుదొడ్లు నాశనం అయిపోయి, అందువల్ల ఘోరమైన అంటువ్యాధులు ప్రబలవచ్చు. ఇంకా చెప్పాలంటే, అంత భయంకరమైన పరిస్థితిలో ఏవిధమయిన సామాజిక జీవనమైనా సాధ్యం అవుతుందని అనుకోలేము. ఇన్ని కారణాలవల్ల అణుయుద్ధంవల్ల సంభవించబోయే మరణాలు ఇందాకా అంచనావేసిన 7 కోట్ల 20 లక్షల కన్నా చాల ఎక్కువ ఉంటాయి.

ఇంతవరకూ మనం పరిశీలిస్తున్న నష్టాలన్నీ ఒక్కరోజు బాంబులు పడడంమూలంగా జరిగేవి. అణు యుద్ధంలో ఇలా బాంబులుపడే రోజులు చాలా ఉంటాయని అనుకోవచ్చు. వెనుకటి అధ్యాయంలో నేను ఉదహరించిన జాతీయ ప్రణాళిక సంఘంవారి నివేదికవల్ల ఇంకా యీ క్రింది విషయాలు తెలుస్తున్నాయి.

"రేడియో ధార్మిక కిరణప్రసారం మూలంగా యుద్ధం జరిగిన రెండు నెలలలో సంభవించే మరణాల విషయమై ఫెడరల్ సివిల్. డిఫెన్సు అడ్మినిస్ట్రేషన్ వారు అంచనా వేసిన సంఖ్యకుతోడు ఆ తరువాత 50 సంవత్సరాల కాలంలో కాన్సరు మొదలయిన వ్యాధులవల్లనూ. పుట్టుకతోనేవచ్చే రోగాలవల్లనూ. ఇన్ని అని చెప్పటానికి వలనుపడని మరణాలు కొన్ని సంభవిస్తాయి. ఆటంబాంబులుపడిన దేశాలలో ఈ విధంగా కాలక్రమాన సంభవించే మరణాలు—బాంబులుపడిన తక్షణం జరిగే మరణాలతో సమానంగా ఉంటాయని చెప్ప వచ్చు. ఈ యాభై సంవత్సరాలలోనూ ప్రపంచమంతటా వ్యాపించిన అణు ధూళివలన, పుట్టుకతోనే వచ్చేరోగాలు, పుట్టకురుపులు మొదలైనవాటివలన, ఇంకొక కోటిమంది మరణించవచ్చు. యుద్ధంలోదిగిన రాజ్యాలవారు అనుభ వించిన నష్టంలో నూటికి 5 నుంచి 10 పాళ్ల పాటి నష్టం, తటస్థంగా వున్న రాజ్యాలుకూడా అనుభవించవలసి రావడం మరీ ప్రత్యేకంగా గమనించవలసిన విషయం."

సోవియట్ రష్యా ఒక్కరోజు బాంబులువేస్తే చాలు, ఇంత నష్టమూ అమెరికాకు కలుగుతుందని సందేహంలేకుండా అనుకోవచ్చు. ఇంకా ఎక్కువరోజులు బాంబులు పడితే అమెరికాలో నష్టాలు ఇంకా ఎక్కువ అవుతాయి. బ్రిటన్ తోసహా యితర పశ్చిమ యూరపుదేశాలు—వాటిలో జనాభా యింకా దట్టంగా ఉందికాబట్టి— ఇంకా ఎక్కువనష్టాల పాలవు తాయి. బహుశా చావగా మిగిలినవాళ్లు, జబ్బులతో, పస్తు లతో ఆరోగ్యవంతులైన పిల్లల్ని కనే ఓపికలేక యాతన

పడుతున్నా—రష్యాలోకూడ చావగా మిగిలినవాళ్ళు ఇలాగే బాధ పడుతున్నారని తెలుసుకొని తృప్తిపడాలని యుద్ధకారకులు భావిస్తారనుకుంటాను! క్రుశ్చేవ్‌కీ, డల్లెస్‌కీ ఇవన్నీ తెలుసా? అయినా వారు దీనిని విజయంగానే భావించబోతున్నారా? లేక, అణుయుద్ధంవల్ల వచ్చే విపత్తులన్నిటినీ యింత వివరంగా పరిశీలించే శ్రమ వాళ్ళు పడనేలేదా?

బాంబులు పడినవెంటనే చావక మిగిలినవారికి ఆటం ధూళివలన కలిగేనష్టం ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. అణుధూళి బాంబులుపడ్డ ప్రాంతపు పరిసరాల్లోనే మొదట ఎక్కువనష్టం కలిగించినా, కొలదికాలంలో అది ప్రపంచమంతటా ఇంచుమించు సమానంగా వ్యాపిస్తుంది. ఆటంబాంబులు పరీక్షార్థం పేల్చినప్పుడు పేల్చినచోటికి బహుదూరపు ప్రాంతాలలోకూడా స్ట్రోన్‌టియమ్ 90, కేసియమ్ 137, కార్బన్ 14 అనే అతి ప్రమాదకరమైన విషపదార్థాలు వ్యాపించడంతో ఈ విషయం తెలిసింది. ఆమధ్య అమెరికాలో స్ట్రోన్‌టియమ్ 90, కేసియమ్ 137 తక్కువగా ఉండి, బాంబు పేలినతరువాత 8,070 సంవత్సరాలపాటు అర్ధవినాశక శక్తితోను, ఒక వెయ్యి సంవత్సరాలపాటు పూర్ణనాశక శక్తితోను అతిఘోరమైన ఆజన్మరోగాలు కలిగిస్తూఉండే కార్బన్ 14 మాత్రం తగ్గకుండా ఉండేరకం బాంబులు తయారుచేయించి – వాటిని 'క్లీన్ బాంబులు' అన్నారు. వాటినిగురించి బోలెడు ప్రచారం చేశారు. ఇంతవరకూ జరిగిన బాంబు పరీక్షలవలన పడిన అణుధూళి ఎంత విపత్తును తెచ్చిపెడుతుందో యిప్పటికే

చెప్పలేకపోతున్నాము. ఇప్పటిలాగే ఆటంబాంబు పరీక్షలు జరిగితే ప్రతి సంవత్సరం 2,30,000 మంది పుట్టుకతోనే విపరీత రోగాలతో జన్మిస్తారు. 4.200 మంది మాతృగర్భంలోనో, పుట్టిన వెంటనేనో మరణిస్తారు అని "ఇంక యుద్ధంవద్దు"* అనే పుస్తకంలో 75 వ పేజీలో డాక్టర్ పాలింగ్ వ్రాసాడు. అందుచేత క్లీన్ బాంబులు ప్రయోగించినప్పటికీ, అణుధూళి వల్ల కలిగేనష్టం కొంత తగ్గుతుందికాని పూర్తిగా పోదు. పైగా. యుద్ధంలో క్లీన్ బాంబులే వేస్తారనే హామీ ఏమీ లేదుకూడా. డాక్టర్ లిబ్బీ అనే ఆయన క్లీన్ బాంబులు తయారుచేయడం మానవకారుణ్య దృష్ట్యా అవసరమని వాదిస్తున్నారు. "అలా అయితే అమెరికావారు క్లీన్ బాంబులు తయారు చేయడంకోసం చేసిన పరిశోధనను గురించి రష్యావారికి తెలియపరచవలసి ఉంటుందా?" అని నేను అడిగాను. కాని, అందుకు ఆయన "అది చట్టవిరుద్ధమైన చర్య అవుతుం"దని కోపంతో సమాధానం చెప్పారు. అంటే దానినిబట్టి - డాక్టరు లిబ్బీకి రష్యావారి మొదలగల మానవకారుణ్యం తనపక్షపు ప్రజలఎడల లేదనుకోవాలి. ఇది అసంభవం కదా! అందుచేత ఫలితార్థ మేమంటే, క్లీన్ బాంబులను గురించిన కబుర్లు వట్టివి అని.

ఫెడరల్, సివిల్. డిఫెన్స్ అడ్మినిస్ట్రేషన్ వారు చిత్రించిన పరిస్థితులు చాలా భయంకరంగా ఉన్నాయి. కాని అంతకన్నా భయంకరమైన విషయం యింకొకటి ఉన్నది. రక్షణశాఖ కార్యదర్శి చార్లెస్ విల్సన్, సెనేట్

---

* *No More War!* by Pauling Linus. Gollancz Ltd. London 1958.

కమిటీవారితో మాట్లాడుతూ "మనకుగల వినాశకశక్తి పెరుగుతూ ఉన్నది. ఇంకా పెరుగుతూ ఉంటుంది" అన్నారు. ఈయన అమెరికాను గురించి మాట్లాడుతున్నప్పటికీ, రష్యావిషయంలోకూడ అదే నిజమని అనుకోవలసి వస్తుంది. గడుస్తున్న ప్రతి ఏడాదితో పాటు అణుయుద్ధం వస్తే రాబోయే ప్రమాదాల స్థాయికూడ పెరుగుతున్నది. చంద్రుడు, కుజుడు, శుక్రుడుకూడ సైనిక స్థావరాలకోసం ఉపయోగపడితే, వినాశక శక్తికి మరీ విపరీతాభివృద్ధి కలుగుతుంది. ఇప్పుడు హైడ్రోజన్ బాంబులనుచూచి మనం భయంతో కంపించిపోతున్నాము కాని, మొన్న మొన్నటి వరకు – అంటే గత మూడేళ్ళక్రితంవరకు – ఆటంబాంబుల పేరు చెవితేనే మన గుండెలు అదిరిపోయేవన్న సంగతి మర్చిపోకూడదు. "డైనమైటు మహామారణశక్తి, దీనితో భయపడి మనుష్యులు యుద్ధాలుచేయడం మానేస్తారు" అని నోబెల్ అనుకున్నాడు. కొద్దిరోజుల్లోనే "హైడ్రోజన్ బాంబులున్న రోజులే ఆనందమైనవి. అంత చిన్న ఆయుధాలను చూస్తేనే మనకి అప్పట్లో ఎలా భయం కలిగేదో!" అని మనం ఆశ్చర్య పడవలసి వస్తుంది. మృత్యువుకు అభిముఖంగా ఒళ్లు తెలియని వేగంతో పరుగెడుతున్న మానవులు ఆగి, వెనక్కి తిరిగి, మళ్లా వివేకం తెచ్చుకొని, జీవితానికి అభిముఖంగా పురోగమిస్తే తప్ప – మానవజాతికి భవిష్యత్తు లేదు.

మూడు

# అణు యుగంలో వివాద పరిష్కార విధానాలు

ఈ అధ్యాయంలోని విషయాలను చెప్పబోయేముందు ఈ క్రింది మూడు ప్రతిపాదనలూ అంగీకరించబడినవని నేను భావిస్తాను.

1. పెద్ద అణుయుద్ధం వస్తే, అందువల్ల వైరివర్గాల వారికే కాక, మొత్తం ప్రపంచానికే మహా విపత్కరమైన పరిస్థితి ఏర్పడుతుంది. అటేస్థితి రావాలని వివేకవంతులు ఎవరూ కోరరు.

2. చిన్న యుద్ధం వస్తే, అది క్రమంగా ప్రపంచ యుద్ధం అయే ప్రమాదం ఉంది. ఇలాంటి చిన్న యుద్ధాలు తరచు వస్తుంటే ఈ ప్రమాదం తప్పనిసరి అవుతుంది.

3. ఇప్పుడున్న అణ్వాయుధాలు అన్నీ నాశనంచేసి, ఇంక కొత్తవి తయారుచేయకూడదనే ఒప్పందానికి వచ్చినప్పటికీ — ఆ తరువాత తీవ్రమైన యుద్ధం వస్తే, మళ్లాకొత్త అణ్వాయుధాలు తయారు చేయడానికి కావలసిన వ్యవధిదాటిన వెంటనే — ఆ యుద్ధం అణుయుద్ధంగా పరిణమించవచ్చు.

ఈ మూడు విషయాలు ఆధారంగా ఆలోచించి చూస్తే, మనకి ఒక సంగతి బోధపడుతుంది — ప్రపంచానికి ఈ విపత్కర పరిస్థితి తప్పాలంటే, మనం అసలు అన్ని యుద్ధాలనూ — చిన్నవి కానీ, పెద్దవికానీ ఉద్దేశ్యపూర్వకంగా

ఆటంబాంబులను ప్రయోగించేవి కానీ, కాకపోనీ అన్ని రకాల యుద్ధాలనూ - నిషేధించే మార్గం కనిపెట్టాలి.

ఈ విషయాన్ని సమగ్రంగా పరిశీలించిన వారందరూ, తెలపటాయిస్తూనయినా, పై నిర్ణయాలను అంగీకరించారను కుంటాను. కాని, ప్రాక్పశ్చిమ రాజ్యాలలో నాయకులెవ్వరూ యుద్ధాన్ని నిరోధించగల కార్యక్రమం విషయమై ఏకాభిప్రాయానికి రాలేదు. ఉభయపక్షాలకూ ఆయుధాలలోసమాన ప్రాబల్యం ఉండడంవల్ల యిద్దరూ డల్లెస్‌గారి నిరంతర సన్నద్ధవిధానాన్ని అనుసరిస్తున్నారు. అమెరికాలో చాలా ధనవంతులైనవారి పుత్రులు ఆడే ఒక ఆట ఆధారంగా ఈ విధానం రూపొందిందట. ఆ ఆటకి 'కోడిపిల్ల' ఆట అని పేరు. ఒక పెద్దరోడ్డుమీద మధ్యకి నిలువుగా ఒక తెల్ల గీతగీస్తారు. రోడ్డుకి రెండు ప్రక్కలనుండీ ఒకదాని కొకటి ఎదురుగా రెండు కార్లు తీవ్రమైన వేగంతో బయలుదేరు తాయి. ప్రతికారుకూ, ఒక ప్రక్కనున్న చక్రాలు రోడ్డు మధ్యగల తెల్లగీతమీద ఉండాలి. ఆ రెండూ ఒకదాని నొకటి సమీపించేటప్పటికి గుద్దుకోనడం తప్పనిసరి అయే పరిస్థితి ఏర్పడుతుంది. అందులో ఎవరు భయపడి తెల్లగీతను దాటి ప్రక్కకు తప్పుకున్నా, రెండవ వాడు 'కోడిపిల్ల' అని అరుస్తాడు. ఆ విధంగా పక్కకి తప్పుకున్నవాడు ఓడిపోయిన వాడి కింద లెక్క. ధనవంతులైన వారు ఆడే ఈ ఆటను ప్రజలంతా అవినీతికరమైన ఆటగా భావిస్తారు. కాని, ఇందులో ప్రాణహాని కలిగినా, అది ఆడేవాళ్ళు ఇద్దరికి మాత్రమే కలుగుతుంది. ఇదే ఆట రాజ్య తంత్రజ్ఞులయిన

వారు ఆడుతూ - తమ ప్రాణాలే కాకుండా కొన్నికోట్ల మానవుల ప్రాణాలను కూడా ఆహుతి చెయ్యబోతున్నప్పుడు, ఉభయపక్షాల ప్రజలూకూడ, తమ నాయకులు చాలా సాహసాన్ని, వివేకాన్ని ప్రదర్శిస్తున్నారనీ, అవతలి పక్షం వారే నింద్యులనీ అనుకుంటారు. నిజానికి యింత ఘోరమైన ఆట ఆడబోయినందుకు ఉభయులనూ నిందించవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఏ ప్రమాదమూ లేకుండాకూడ ఆట ఆడటం సాధ్యం కావచ్చు, కాని అణుబాంబులతో నాశనమయిపోవడంకన్న, ఆటలో ఓడిపోయామనిపించుకోవడం ఎక్కువ భయంకరమనిపించే పరిస్థితి ఎప్పుడో ఒకసారి వస్తుంది. చివరకు ఏ పక్షమూ ఎదిరిపక్షంచేత 'కోడిపిల్ల' అనిపించుకొనే అవమానాన్ని భరించలేదు. ఆ స్థితివచ్చేసరికి నాయకులు ప్రపంచాన్ని సర్వనాశనంలో ముంచేస్తారు.

రాజకీయనాయకులుకూడ ఈ విషయాలను అంగీకరిస్తారు. కాని, ఈ విధానంతప్ప గత్యంతరం లేదని వాదిస్తారు. ప్రపంచ యుద్ధానికి ఒకపక్షంవారు సిద్ధపడి, రెండవపక్షం వారు భయపడుతుంటే, యుద్ధానికి సిద్ధపడేపక్షం అన్నిటిలోను పైచెయ్యిగావుండి, ఎదుటిపక్షాన్ని పూర్తిగా శక్తిహీనంచేస్తుంది. వివేకవంతమయిన పక్షంవారు ఈవిధంగా యుద్ధోన్మాదపక్షానికి లొంగిపోవడం కార్యవాదియైన నాయకుడెవడూ అంగీకరించడు. బహుశః అట్టివిధానం ఆదర్శవాది దృష్టిలో మంచిదే కావచ్చు. కాని, వివేకమో, అవివేకమో, ఆభిజాత్యంగల జాతి ఏదీ అంతనీచంగా ఎప్పుడూ ఇంకొకరికి తలవంచుతూ ఉండలేదు. అందుచేత సర్వసన్నద్ధంగా ఉండ

డమో, ఓడిపోవడమో, ఈ రెండే మాకు మార్గాలు— అని వీరు వాదిస్తారు.

ఈ మధ్య ఉభయపక్షాలవారూ ఇదే భావాన్ని విశ్వసిస్తున్నారు. యుద్ధానికి సర్వసన్నద్ధంగా ఉండడమో, లేకపోతే లొంగిపోవడమో— ఈ రెండే మార్గాలనీ, యిక గత్యంతరం లేదనీ నే నంగీకరించను. అధికార ప్రాబల్య తృష్ణ లేకుండా, సర్వమానవ సౌభ్రాత్రానికీ ఉభయపక్షాల ప్రయోజనాలకూ ఉపయుక్తమైన నూతన విధానమే యిప్పటి పరిస్థితులలో ఆవశ్యకం. అందుచేత మొదట చేయవలసిన పని—మానసికమైన మార్పు వచ్చేటట్లు చేయడం. ఇది సాధ్యం కావాలంటే, ఉభయపక్షాలవారి లక్ష్యాలు, ఉద్దేశాలు మారాలి. ప్రభుత్వాలకు సంబంధించినంతవరకూ ఈ మార్పుకోసం తటస్థరాజ్యాలవారు చొరవచేసి పూనుకోవాలి. ఉభయపక్షాలలోను గౌరవనీయులైన వ్యక్తులు, సమాజాలు, ప్రభుత్వాల స్వభావాలను మార్చడానికి ప్రయత్నించాలి.

ఉభయపక్షాల ప్రభుత్వాలకు చేయవలసిన హితబోధ యించుమించు ఈ క్రిందివిధంగా ఉంటుంది. ఉభయ వర్గాలకూ తాము వదలుకోనలేని ప్రధాన ప్రయోజనాలున్నాయి. ఏపక్షమూ తన్ను తాను నాశనంచేసుకోకుండా ఎదుటి పక్షాన్ని నాశనం చెయ్యలేదు. ఉభయపక్షాలకూ పరస్పర విభేదదాయకములైన విషయాలకన్నా ఏకాభిప్రాయానికి రావడానికి వీలున్న విషయాలే ప్రముఖమైనవి. ఉభయ

లకూ ప్రధాన ప్రయోజనం మనుగడ. అణ్వాయుధాలు కారణంగా మనుగడ ఉభయులకూ ఉమ్మడి ప్రయోజనం అయింది.

అమెరికనులకు, లేదా వారిలో కొందరికి, ప్రపంచం లోని రష్యనులందరూనాశనం కావాలనేకోరిక ఉండవచ్చు. అలాగే రష్యావారికి, లేదా వారిలో కొందరికి, ప్రపంచం లోని అమెరికనులందరూ నాశనం కావాలనేకోరిక ఉండ వచ్చు. కాని, ప్రపంచంలోని అమెరికా, రష్యా జాతులు రెండూ పూర్తిగా నాశనం అయిపోవాలని ఉభయజాతుల వారూ కోరుకోరుగదా! యుద్ధం వస్తే, రెండు జాతులూ తుడిచిపెట్టుకుపోతాయి కాబట్టి, రెండుదేశాలూ ప్రపంచ శాంతి రక్షణకోసం, స్వప్రయోజనదృష్ట్యా ప్రయత్నించాలి. అందుచేత, ఉభయులూ మనగలగడం – ఉభయదేశాల విధానాలలోనూ ప్రధానలక్ష్యం అయిఉండాలి.

ఇది కాక, ఆయుధాలపోటీనుండి తప్పించుకోవలసిన అవ సరం ఒకటి ఉంది. ఉభయపక్షాలూ ఒక ఒడంబడికకు రావా లనడానికి యిది యింకొక కారణం. ఇప్పటి విధానాలు కొనసాగితే, ఆయుధాలు తయారుచేయవలసిన బరువు పెరుగు తూనే ఉంటుంది. ఇంకా ఎక్కువ ఖరీదయిన ఆయుధాలు కనిపెడుతూ ఉంటారు. ఇంకా ఎక్కువ శ్రమను, ధనాన్ని, ప్రజోపయుక్తవస్తువులను చేయడానికి మాని, మారణాయు ధాలు చేయడానికి వినియోగిస్తారు. అనతికాలంలోనే, ఉభయపక్షాలలోని ప్రజలకూ తినడానికితిండికూడా లేకుండా

పోతుంది. ఇతరపరిస్థితులలో మనకు ఉపయోగకరంగా ఉన్న శాస్త్రజ్ఞానం అప్పుడు ఉపయోగకరంగా ఉండదు. కొత్తశాస్త్రజ్ఞానంవల్ల వచ్చే ప్రతి ప్రయోజనాన్నీ యుద్ధానికే వినియోగిస్తారు. ఈ భారం భరించలేక ఏపక్షమయినా ముందు తిరగబడితే, అది ఓడిపోతుంది. అప్పుడు ఏర్పడే ప్రమాద పరిస్థితిని తలుచుకుంటే, ఆ ప్రమాదాన్ని దాటటానికి ఎంతటిత్యాగమైనా చేయవలసిందేనని అనిపిస్తుంది.

ఉభయవర్గాల మధ్య స్పర్థభావం తగ్గితే మనకు విపత్తు తగ్గడమేకాక, యింకా అనేక యితర ప్రయోజనాలు కూడా కలుగుతాయి. ప్రపంచంలో అన్ని ప్రాంతాలలో, ముఖ్యంగా పేద ప్రాంతాలలో, ప్రజల జీవన ప్రమాణాలను అభివృద్ధిచేయడానికి శాస్త్రవిజ్ఞానం చాలా ఉపకరిస్తుంది. ఆసియా, ఆఫ్రికా ఖండాలలో ఇప్పుడున్న పేదరికం ఇలా ఉండడానికి మన తెలివి తక్కువతనం తప్ప వేరేమీ కారణం కాదు. ఆయుధాలపోటీ యిలాగే కొనసాగితే, అమెరికాలో జీవన ప్రమాణాలు కూడా ప్రపంచంలోని అతి పేదదేశాల స్థాయికి దిగజారిపోయి, శాస్త్రవిజ్ఞానాభివృద్ధివల్ల సర్వప్రపంచ సౌభాగ్యం బదులు సర్వమానవ దారిద్ర్యం వ్యాపిస్తుంది.

ప్రాక్పశ్చిమ రాజ్యాల మధ్య వైరం వలన కలిగేనష్టం కేవలమూ భౌతికమైనదేకాదు. నైతికంగాను, మానసికంగానూ కూడా అంతకన్నా తీవ్రమయిన నష్టాలు సంభవిస్తాయి. బ్రిటను యుద్ధంలో చిక్కుకొనడం సంభవిస్తే, పౌరులను రక్షించాలని పెద్ద ప్రయత్నమేదీ జరగదనీ, రష్యావారి మీద

బాంబులూ, రాకెట్లూ పేల్చగల సైనికులను మాత్రం పౌరులకన్నా కొంత ఎక్కువకాలం బ్రతికించడానికి ప్రయత్నిస్తారనీ, అందువల్ల వారు అంతిమ క్షణాలలో కూడా కొన్ని లక్షలమంది రష్యావారిని చంపి మరీ చచ్చిపోవడానికి వీలుంటుందనీ చాల అధికారికంగా తెలియవచ్చింది. చిట్టచివర చనిపోయేవారు తమ జాతి అంతా సర్వనాశనం అయిపోయారన్న సంగతి తెలుసుకొని మరీ చచ్చిపోతారు. కాని, అవతలిపక్షం కూడా అలాగే నాశనం అయిపోయిందన్న వ్యర్థసంతృప్తి వలన అప్పటికీ వారికి ఆనందం కలుగుతుంది (అని మనం అనుకోవాలి). నేను ఈ మాటలు బ్రిటిషువారి విధానాలమీద ప్రత్యేక కోపంకొద్దీ చెప్పడంలేదు. ఉభయ పక్షాలవారూ యిదే విధానం అనుసరణీయమని వాదిస్తున్నారు. చివరకు మతాన్నికూడ ఇట్టి అభిప్రాయాలకు ఆసరాగా వాడుకుంటున్నారు. ఆదర్శవాదం ఆధారంగా ఇట్టి విధానాన్ని సమర్థించవచ్చునని ఎంతో మంది సజ్జనులు కూడా పొరపాటుపడుతున్నారు. వీరు ఎంత సజ్జనులైనా వారి వాదం యొక్క పర్యవసానం చాలా భయంకరమైనది. ఇట్టి వాదానికి లొంగిపోయే వారందరూ తమ మనస్సులను విషపూరితం చేసుకొంటున్నారు.

ఇన్ని కారణాలవల్ల —ఆదర్శవాదం దృష్ట్యా చూచినా, కేవలం స్వార్థపూరిత దృష్టితో చూచినా, ప్రాక్పశ్చిమ రాజ్యాలు తమ అభిప్రాయ భేదాలను, యుద్ధంవల్లగాని యుద్ధపు బెదరింపులవల్లగాని పరిష్కరించుకొనజూడడం కూడదని తెలుస్తున్నది. ఇంతవరకూ నేను చెప్పిన విస్పష్టమైన,

సరళమైన వాదనలలోని బలాన్ని ప్రాక్పశ్చిమరాజ్యాలు రెండూ అంగీకరిస్తే, వివాదాస్పదవిషయాలపై ఒప్పందం కుదర్చడానికి మార్గాలుదొరకడం అసాధ్య మనిపించదు. రాజకీయ చతురంగంలో తనకు విజయ సాధకమనిపిస్తే తప్ప ఏ పక్షమూ ఏ పరిష్కారమార్గాన్నీ అంగీకరించక పోవడం వల్ల, ఇంతవరకూ ఉభయులకూ ఏకాభిప్రాయం కుదరడం లేదు. రాజకీయ విజయం సంపాదించడం కన్నా శాంతిని సాధించడమే ఎక్కువ అవసరం అని ఉభయపక్షాలవారూ గుర్తించగలిగితే - నిష్పాక్షిక పరిష్కార మార్గాలు ఇప్పుడను కుంటున్నంత దుర్లభంకావు.

ఈ వాదన ఒక పక్షానికి ప్రయోజనాన్ని కాని, యింకొక పక్షానికి నష్టాన్ని కాని కలిగించాలనే ఉద్దేశ్యంతో చేసింది కాదనీ, యిది ఉభయపక్షాలకూ సమాన ప్రయో జనదాయకమైనదనీ, ఈ వాదనను బలపరచేవారు స్పష్టం చేయాలి. సంఘర్షణ కొనసాగిస్తే ఉభయులూ సర్వనాశన మవుతారు. ఐక్యమత్యం సాధిస్తే ఉభయులకూ అనంత మైన సంపదలు లభిస్తాయి.

నాలుగు

# శాంతిసాధనకు అవసరమైన చర్యలు

అణ్వాయుధాలవల్ల వచ్చే ప్రమాదాన్ని గుర్తించిన వారందరి మీదా చాలా దారుణమైన బాధ్యత ఉన్నది. ఈ ప్రమాదం క్రొత్తది కాబట్టి వారి ఆలోచనా విధానం కూడా క్రొత్త పద్ధతిలో ఉండాలి. ఈ అణుయుగంలో మానవజాతి మనగలగాలంటే. ప్రపంచ యుద్ధాన్ని వారించడం ఒక్కటే మార్గం. కాని యీపని సాధించడం చాలాకష్టం. దేశదేశాల ప్రజలకు, రాజకీయనాయకులకు ఎన్నో ద్వేషభావాలు ఉన్నా, యుద్ధాన్ని వారించడం సాధ్యం కావాలంటే పరస్పర విరుద్ధ పక్షాల భావాలను అర్థంచేసుకోవడంద్వారాను, క్రమక్రమంగాను మనం ప్రయత్నాలు చేయాలి.

అందరూ ఆచరిస్తే యుద్ధాన్ని సమర్థంగా వారించగల చర్యలను కొన్నిటిని సూచించడంతో ఈ సమస్య నివారణ కాదు. ఆ చర్యలు ప్రాచ్యదేశాలలోను, పశ్చిమదేశాల లోనుకూడా ప్రభుత్వాలచేత ఆచరింపజేయడానికి అనువైనవై ఉండాలి. ఈ రెండు మంచి లక్షణాలూ ఉన్న చర్యలు ఏపక్షానికీ ఎదిరి పక్షంకన్నా అధిక లాభదాయకంగా ఉండకూడదు. పైగా వీటిని ఆచరించడంవలన ఏదేశం ప్రాణప్రదములుగా భావించుకుంటున్న ప్రయోజనాలూ నష్టపడకూడదు.

సురక్షిత ప్రపంచ శాంతి సాధించడానికి చేసే ప్రయత్నంలో మనం ఎక్కవలసిన మెట్లు చాలా ఉన్నాయి. ఇందులో మొదటి మెట్లు తరువాతి వాటికన్నా కొంచెం తేలిక. ప్రాచ్యరాజ్యాలవారికి, పశ్చిమరాజ్యాలవారికీ "మీ ఆశయాలు యుద్ధంవల్ల నెరవేరవు" అని చెప్పి ఒప్పించగలగడం మొదటి మెట్టు. పశ్చిమరాజ్యాలవారికీ, ప్రాచ్యరాజ్యాల వారికీ "మీ ఎదిరిపక్షం పై విషయాన్ని పరమ సత్యంగా విశ్వసిస్తున్నది" అని చెప్పి ఒప్పించ గలగడం రెండవమెట్టు. ఎదిరిపక్షం మనఃపూర్వకంగా శాంతిని కోరడంలేదని అను మానించడం ఈ మధ్య ఉభయ పక్షాలకూ అలవాటై పోయింది. ఈ అనుమానానికి ఉభయపక్షాలవారికీ తగిన కారణాలు లేవని మనం అనలేము. అందుచేత పరిష్కార ప్రయత్నాలు సఫలంకావాలంటే, ఉభయపక్షాలవారికి శాంతికాంక్ష మనఃపూర్వకంగా ఉన్నంత మాత్రాన చాలదు. అట్టి కాంక్షయే ఎదుటివారికికూడా ఉందని రెండు పక్షాలకూ విశ్వాసం కుదరాలి. మనఃపూర్వకంగా శాంతిని కాంక్షించడం అంటే ఇక్కడ కొంచెం వివరించడం అవసరం. ఉభయపక్షాల రాజనీతిజ్ఞులు హఠాత్తుగా తమరాజ్యాల ప్రయోజనాల యెడల నిర్లిప్తభావం వహిస్తారని మనం అనుకోకూడదు. అవతలి పక్షం శాంతికోసం చేసే ప్రతిపాద నలను తిరస్కరిస్తే అప్రతిష్టపాలవుతామేమోననే భయంతో వానికి ప్రతిగా అవతలి పక్షం అంగీకరించడానికి వీలులేని ఎదురు ప్రతిపాదనలు చేస్తూండే ప్రస్తుతపు అలవాటు మానేసి – అంగీకారం కుదుర్చుకుందామని మనఃపూర్వకంగా

ప్రయత్నాలు చేయాలి. ఈమాత్రం నిజాయితీ ఇరుపక్షాలకూ ఉంటేచాలు. తరువాత అంగీకరించవలసిన విషయం–"ఉభయ పక్షాలలో ఏ పక్షానికీ నష్టం కలగని మార్గమే అంగీకరించ బడు తుంది" అని ప్రకటించడం. యుద్ధం వల్ల ఏ రాజకీయ ప్రయోజనమూ సాధించలేము అని ఉభయపక్షాలూ మనః పూర్వకంగా ఒప్పుకున్న తరువాత కుదిరిన ఏ అంగీకారమైనా సరే – ఇప్పుడు ఉభయ పక్షాలకూ ఉన్న తుల్య ప్రాబల్య స్థితికి భంగంకలిగించేదిగా ఉండకూడదు. ఈ తుల్య ప్రాబల్య స్థితిలో మార్పులువస్తే, పరిస్థితి కొంత మెరు గవుతుందేమో. అనేవిశ్వాసాన్ని ఏపక్షంవారూ పరిత్యజించ వలసిన అవసరం లేదు ఈ అంశంపై ఇరుపక్షాలవారూ తమపూర్వ విశ్వాసా లను నిలుపుకోవచ్చు. కాని ఆ విశ్వాసాల సాధనకి అనుసరించే విధానాలు మాత్రం మార్చుకోవలసి ఉంటుంది. ఆ విధానాలు ప్రజాస్వామిక దేశాలలో వివిధరాజకీయ పక్షాలు అనుస రించే విధానాలవంటివై ఉండాలి. అంటే నయాన చెప్పి ఒప్పించేవిగాని, సైనికబలంతో భయపెట్టి లొంగదీసేవిగాని ఉండకూడదు.

తరువాత చేయవలసినపని – పరస్పర నిందను మాని వేయడం. పశ్చిమరాజ్యాలు రష్యాదుష్టమైన దనుకొంటే, ప్రాచ్యరాజ్యాలు అమెరికా దుష్టమైన దనుకుంటున్నాయి. ఉభయపక్షాలూ ఒకరినొకరు తిట్టుకొనడంలో ఇంతవరకూ ఏమీ నిగ్రహాన్ని చూపలేదు. కాని పరిష్కార ప్రయ త్నాలు ఫలవంతం కావాలంటే, కొంతవరకు పరస్పరసౌజన్యం అవసరం. ఈ సంగతి అలా ఉంచి శత్రుపక్షంవారు దుష్టులు

అనే విశ్వాసం క్రమంగా అతిశయోక్తం అయే అవకాశం ఉంది. మానవుల బ్రతుకంతా రాజకీయమైనదే కాదు. మానవభావనా సహజమైన ఆశలు, భయాలు, సంతోషాలు, బాధలు ప్రాచ్యరాజ్యాలలోనూ, పశ్చిమ రాజ్యాలలోనూ ప్రజలందరికీ సమానమే. ఉభయపక్షాలలోనూ ఉన్న ప్రచార యంత్రాంగాన్ని విద్వేషాన్ని విస్తరింపజేయడానికి బదులు సర్వమానవ సౌభ్రాత్రాన్ని విస్తరింప జేయడానికి ఉపయోగించాలి. ఈ లక్ష్యం కొంతవఱకు సాధిస్తున్నారు కాని. అవసరమయిన స్థాయికి రా లేదని మళ్లా చెబుతున్నాను.

ప్రభుత్వాలు అంగీకరిస్తాయని ఆశింపదగిన మొదటి చర్య – అణ్వాయుధ పరీక్షలు నిషేధించడం. తక్షణం ఆచరింపదగిన చర్యలలో ఇది మొదటిది. ఇది మొదటి మెట్టే అయినా, దీనికి తగినంత ప్రాముఖ్యం ఉన్నది. ఇందువల్ల మానవులకు ఆజన్మ రోగాలను తెచ్చిపెడుతున్న మానవ నిర్మిత విషాలు నశించిపోతాయి. ఇంతకన్నా ముఖ్యమయిన విషయమేమిటంటే, ఈ పరీక్షలను ఆపు జేయడంవల్ల ఇంత వరకు అణుబాంబులు లేని రాజ్యాలుకూడా వాటిని తయారు చేసుకునే పరిస్థితి తప్పుతుంది. ఈ రకంగా అణుశక్తి అందరి చేతిలోకీ రావడంవల్ల అణుయుద్ధం వచ్చే ప్రమాదం ఎక్కువ అవుతుంది. అణ్వాయుధ పరీక్షలు ఆపడం మంచిదని చెప్పడానికి ఇంకొక కారణం కూడా ఉంది. ప్రాక్పశ్చిమ రాజ్యాల మధ్య ఏమాత్రం అంగీకారం కుదిరినా, అది మంచికే దారి తీస్తుంది. నిరాయుధీకరణ సమావేశాలలో తెగకుండా ముడిపడకుండా ఎంతో కాలంనుండి సాగుతున్న చర్చలు

చూస్తూంటే ప్రపంచంలోని శాంతికాముకు లందరికీ నిరాశ కలుగుతున్నది. అణ్వాయుధ పరీక్షలు ఆపుచేయడం విషయమై అంగీకారం కుదిరితే అది అందరికి ఆశాకారణ మవుతుంది.

తరువాత వెంటనే చేయవలసిన రెండవచర్య—అమెరికా, రష్యా రెండూకలిసి "మేము మా అభిప్రాయ భేదాలను యుద్ధంవల్లకాని, యుద్ధపు బెదిరింపులవల్లకాని కాకుండా, యితర శాంతియుత విధానాలద్వారానే కుదుర్చుకుంటాము" అని సంయుక్తప్రకటనచేసి, ఆ ప్రకటనను అమలుపరచడానికి ఒక శాశ్వత సంయుక్త సంఘాన్ని నియమించి, ప్రాబల్యతౌల్యానికి భంగం కలుగకుండా ఉంచడానికీ, శాంతిని సాధించడానికీ ఆ సంఘానికి అవసరమైన అధికారాలను అప్పచెప్పడం. ఆ సంఘానికి అంతిమ నిర్ణయాధికారాలు ఇవ్వడం కొన్నాళ్ళ అనుభవం మీదకాని వీలుపడదు. తలయెత్తిన ప్రతి అభిప్రాయభేదాన్ని ఈ సంఘం పరిశీలించి, ఉభయ పక్షాలకూ ఆమోదయోగ్యమయిన పరిష్కార మార్గాన్ని సూచించడానికి అవకాశం ఉండాలని మాత్రమే నేను ప్రతిపాదిస్తున్నాను ఏ పరిష్కార మార్గమయినా ప్రపంచంలో ఒక భాగంలో ఒక పక్షంవారికి లాభకరంగాను, ఇంకొకభాగంలో ఇంకొక పక్షంవారికి నష్టకరంగాను ఉండవచ్చును. కాని, ప్రపంచ పరివ్యాప్త పరిష్కారమార్గానికి ప్రపంచమంతా అఖండమయినదనే భావం అవసరం. అందుచేత ఈ సంఘంవారి ప్రయత్నాలవల్ల నిశ్చితమయిన నిర్ణయాలు జరగడానికి కొంత వ్యవధి పట్టవచ్చును.

ఈ సంఘం పరిష్కరించవలసిన సమస్యను రెండు భాగాలుగా విడదీయ వచ్చును. ఈరెండూ నిజానికి పరస్పర సంబంధంలేని భిన్నసమస్యలు కాకపోయినా, ప్రస్తుతానికి ఇలా విడదీద్దాము : 1. నిరాయుధీకరణ, 2. వివిధ ప్రదేశాలకు సంబంధించిన వివాదాలు. రెండవ విషయంలో యథాస్థితి అట్టేపెట్టాలి. కాని, మొదటి విషయంలో తక్షణ చర్యలు అవసరం.

నిరాయుధీకరణ సమస్యకు అంత అత్యవసర ప్రాధాన్యంఇవ్వడం అనుద్దిష్టయుద్ధాన్ని రాకుండా ఆపడంకోసమే. తక్షణ ప్రతీకారచర్య తీసుకోవాలనే భావాన్ని పశ్చిమ రాజ్యాలు ప్రకటించడంవలన, బహుశః ప్రాచ్యరాజ్యాలు కూడా అదే పద్ధతిని అనుసరిస్తూ ఉండడంవలన, ప్రపంచం విపత్కర పరిస్థితిలో పడింది. కాని, ఇట్టి విపత్తు ఉన్నదని రాజ్య తంత్రజ్ఞులు తగినంతగా అంగీకరించడంలేదు; ప్రజలు తగినంతగా గుర్తించడంలేదు. తాను అప్రేరితంగా అణుయుద్ధం ప్రారంభించనని ఏపక్షానికాపక్షం ప్రకటిస్తూనే ఉంది గాని, రెండవ పక్షానికి అదేసుగుణం ఉంటుందని విశ్వసించడంలేదు. ఏదో ఒక హఠాత్సంఘటననుచూసి శత్రుపక్షం వారు అణుయుద్ధాన్ని ఆరంభించారని పొరపాటు పడడమూ, అది పొరపాటని తెలియకముందే దానిపై ప్రతీకారచర్య తీసుకోనడమూ జరగవచ్చు. ప్రపంచంలో ఇంకా చాలా రాజ్యాలకుకూడా అణు ఆయుధాలు ఉంటే ఈ విపత్తు మరీ ఎక్కువవుతుంది. చిన్న రాజ్యాలమీద జరిగిన దండయాత్ర

అగ్రరాజ్యాలమీదనే జరిగినట్లు భావించబడడమూ, దానితో అది ఒకటి రెండు గంటలలో మహా సంగ్రామంగా పరిణమించడమూ సంభవం. అట్టి ప్రమాదాలను వారించడానికి తక్షణ ప్రయత్నాలు జరగాలి. ఎవరు దాడిచేశారనే అనుమానం కలిగినా – తక్షణం అణుబాంబులతో జవాబు చెప్పడానికి ఉభయపక్షాలూ కాసుకొని కూర్చున్నంతకాలమూ ఎట్టి శాంతిప్రయత్నాలూ మనకు రక్షణ నీయలేవు.

అయిదు

# పరిష్కార ప్రయత్నాలకు ఆవశ్యకమయిన క్రొత్త దృక్పథం

ఈ అధ్యాయంలో నేను చేయదలచినపని—అణు యుద్ధం వచ్చే ప్రమాదాన్ని తగ్గించడానికి స్పష్టమయిన చర్యలు సూచించడం కాదు. అసలు, సంప్రదింపులు ఫలవంతం కావాలంటే ఉభయపక్షాల వారిలోను ఉండవలసిన సామాన్య ధోరణి ఎలా ఉండాలో నేను పరిశీలిస్తాను.

ప్రపంచంలోని బలమయిన రాజ్యాలన్నీ వారి జాతీయ ప్రయోజనాలను నూతన దృక్పథంతో అంచనా వేసుకోనడం మొట్ట మొదటి అవసరం. ప్రపంచశాంతికి అనుసరణీయములైన మార్గాలన్నీ ప్రపంచంలో అన్ని దేశాల జాతీయ ప్రయోజనాలకూ అనుకూలమయినవిగా ఉండాలి కూడా. జాతీయ ప్రయోజనాలను కొత్తగా అంచనా వేసుకోనడం కొన్ని నూతన సత్యాలను గుర్తించడం కోసమే కాని తమ తమ లక్ష్యాలను మార్చుకోనడం కోసం కాదు. ఏ ప్రభుత్వమూ ఆచరణ సాధ్యమయిన లాభాన్ని దేనినీ వదలుకోవలసిన అవసరం లేదు. అందుచేతనే ఈ విజ్ఞప్తులను వారు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

శక్తివంతమయిన రాజ్యాలు ఇంతవరకు తమ విధానాలలో రెండు అంశాలను ప్రధానంగా అనుసరిస్తున్నాయి.

ఒకటి—తమ దేశాల సౌభాగ్యం. రెండవది—ఇతర దేశాలపై రాజకీయంగాను, ఆర్థికంగాను, లేక సైద్ధాంతికంగాను ప్రాబల్యాన్ని వహించడం. పరదేశాలపై యుద్ధంద్వారా ప్రాబల్యాన్ని సాధించడం ఇంతవరకు సాధ్యమయినంత తేలికగా ఇప్పుడు సాధ్యం కాదు. ప్రస్తుత పరిస్థితిలో గుర్తించవలసిన నూతనాంశం ఇది. తమ దేశపు సౌభాగ్యాభివృద్ధి ఇతఃపూర్వంలాగే ఇప్పుడూ కొనసాగించుకొనవచ్చును గాని పరదేశాలపై ప్రాబల్యం మాత్రం—ఇంతవరకు ఉన్నదేదో తప్ప—కొత్తగా యుద్ధంద్వారా సాధించడం ఏ సామ్రాజ్యవాద దేశానికీ సౌభాగ్యదాయకమైన మార్గం కాదు. తమ దేశాన్ని క్షేమంగానూ, సౌభాగ్యవంతంగానూ చేసుకోవాలనుకునే రాజ్య తంత్రజ్ఞుల ఆశయాలు ఇప్పుడు సఫలం కావాలంటే, ఇతర దేశాలనుకూడా క్షేమంగానూ సౌభాగ్యవంతంగానూ ఉంచడం ఒక్కటే అందుకు సాధనం. ఈ నూతన దృక్పథానికి ఏదో అపూర్వ నైతిక పరివర్తనం కారణం కాదు. ఇది కేవలం నూతన మారణాయుధాల అనంత వినాశకశక్తి తెచ్చిన మార్పు. నీవు రష్యనువైతే, ప్రపంచమంతా కమ్యూనిజంవస్తే బాగుండునని అనుకోవచ్చు. నీవు అమెరికనువో, పశ్చిమ యూరోపావాడవో అయితే, ప్రపంచమంతా నీ దేశం అనుసరించే రాజకీయ, ఆర్థిక వ్యవస్థలను అనుసరిస్తే బాగుండునని అనుకోవచ్చు. ఈ రెండు అభిప్రాయాలలో దేనినీ, ఎవ్వరూ పరిత్యజించవలసిన అవసరం లేదు. కాని, ఏ అభిప్రాయమైనా యుద్ధంవల్ల సాధించబడుతుందనే నమ్మకాన్ని మాత్రం అందరూ పరిత్యజించి తీరాలి.

మానవ చరిత్రలో ఇది నిశ్చయంగా అపూర్వమయిన విషయం. ఇస్లామ్‌కి, క్రైస్తవమతానికి సంఘర్షణవచ్చినప్పుడు ఏదేశం క్రైస్తవ మతాన్ని అనుసరించాలి, ఏది ఇస్లామ్ మతాన్ని అనుసరించాలి అనే సంగతి యుద్ధంవల్లనే తేలింది. ప్రొటెస్టెంటులకు కేతలిక్కులకు మధ్య వచ్చిన వివాదాలు కూడా సైనిక బలాబలాలవల్లనే పరిష్కరించబడ్డాయి. అమెరికా ఖండం అంతా ఈరోజున క్రైస్తవ మతాన్ని అనుసరిస్తూండడానికి ఎర్ర ఇండియనుల ఆయుధాలకన్నా యిరోపావారి ఆయుధాలు బలవత్తరములైనవి కావడమే కారణం. మానవజాతి చరిత్ర అంతటా పెనవేసుకొనిపోయిన యుద్ధ భావాన్ని ఇప్పుడు వదిలించుకోవడం రాజకీయ నాయకులకుగాని, సామాన్య ప్రజలకుగాని తేలికగా సాధ్యంకాదు. అమెరికా, బ్రిటన్, రష్యా, చైనాదేశాల ప్రముఖ అధికారులు వారివారి సిద్ధాంతాలను ప్రపంచ వ్యాప్తంచేయడం అణు యుద్ధంవలన సాధ్యమవుతుందని తాము నమ్ముతున్నట్లు ఈ మధ్యనే ప్రకటించారు. ఇట్టి ప్రకటనలన్నీ నిజంగా వారు నమ్ముతున్నవో, లేకపోతే వారు ఆడుతున్న బుకాయింపు నాటకాలలో ఒక భాగమో మనం చెప్పలేము. ఏది ఏమైనా, అవి చాలా ప్రమాదకరం. అవి ఉత్త బుకాయింపులే అయితే ఆ బుకాయింపు నిజమయ్యే ప్రమాదంకూడా ఉంది.

అణుయుద్ధంవల్ల రాబోయే ఫలితాన్ని ఖచ్చితంగా అంచనావేయడం అసాధ్యం. ప్రపంచ జనాభాలో సగం మంది బ్రతుకుతారని కొందరు, నాల్గవవంతు బ్రతుకుతారని కొందరు, అసలు ఎవ్వరూ బ్రతకరని మరికొందరూ అంటు

న్నారు. మన విధానాన్ని నిర్ణయించుకోడానికి మాత్రం ఈ అంచనాలతో ఏమీ నిమిత్తం లేదు. సందేహంలేకుండా మనకు తెలిసిన విషయం ఏమిటంటే, అణుయుద్ధానంతరం ఉండే ప్రపంచం ఇటు మాస్కో వారికిగాని, అటు వాషింగ్టన్ వారికిగాని సుఖదాయకంగా ఉండదు. అన్నిటికన్నా ఎక్కువ ఆశాజనకమైన అంచనాలు ఆధారంగా ఆలోచించినా, అణుయుద్ధానంతర ప్రపంచంలో మిగిలిన ప్రజలు బికారులై, ఆకలితో పిచ్చెక్కి, రోగాలతో బలహీనులై, నవీన యంత్ర పరిశ్రమలుగాని, ప్రయాణ సాధనాలుగాని లేక, విద్యాసంస్థలు నడిపే సామర్థ్యంలేక అజ్ఞానులైన ఆటవికజాతుల స్థాయిలో బ్రతుకుతూ ఉంటారు.

ఇది అత్యంత ఆశాజనకమైన అంచనాలు ఆధారంగా చేసిన ఊహ అని మరొకసారి చెబుతున్నాను. ఈ పరిస్థితి ఇప్పుడు భిన్నసిద్ధాంతాలను విశ్వసిస్తున్నవారెవరికిగాని, మానవత్వంగల ఏ వ్యక్తికిగాని, ఆఖరుకు ఏమాత్రం ప్రపంచ జ్ఞానంగల వ్యక్తికిగాని ఆమోదయోగ్యమైన స్థితికాదు. ఇందువల్లనే పరస్పరం ఎంత భిన్నంగాఉన్న రాజ్యాలవారయినా, ఎన్ని ఇతర అల్ప విషయాలపై అభిప్రాయ భేదాలున్నా, ఈ ఒక్క అంశంపై ఏకీభావం కుదరాలి. అణుయుద్ధం, ఏమైనా, రాకుండా ఆపాలి. ఏ దేశమూ తన జాతీయ స్వార్థాలను లేశమైనా వదలుకోన నక్కరలేదు. కాని, ఆ స్వార్థాలను సాధించుకోవడం ఎలాగ అనే విషయం వివేకవంతంగా ఆలోచించుకోవాలి. నీవు దేశభక్తుడవైన బ్రిటిష్ పౌరుడవో, అమెరికా పౌరుడవో అనుకో. నీవు

పాత పద్ధతులలోనే ఆలోచిస్తున్నావనుకో. నీకు రెండు రకాల ఉద్దేశాలుండవచ్చును. ఒకటి : నీదేశపు పౌరుల సుఖాన్ని పెంపొందించడానికి ఏదేశంలో సాధ్యమయినంత కృషి చేయాలనే కోరిక. రెండు : ఇతర దేశాల సుఖసౌఖ్యాలు నష్టపరచి, నీదేశం బాగుపడడానికి కావలసిన కృషి చేయాలనే కోరిక. ఈ రెండవ ఉద్దేశ్యాన్ని ఇంతవరకూ యుద్ధం వలననే ఎక్కువగా నెరవేర్చుకుంటూండేవారు. ఇప్పుడు ఈపద్ధతి వీలు లేదు. ఈ పద్ధతిలో ఈ కోరిక నెరవేర్చు కొనడమే వీలు లేదంటున్నాను కాని. ఈఉద్దేశ్యం అసలు నెర వేర్చుకొనే వీలే లేదంటున్నా ననుకోకండి. రష్యావారు చెకోస్లవేకియాలోని యూరేనియం గనులమీద లాభాలు పొందడంలేదా! బ్రిటన్ మధ్యప్రాచ్యంలోని నూనెగనుల మీద లాభాలు పొందడంలేదా! కాని ఈ రెండు అవకాశాలు కూడా అన్యాయమైన బలప్రతిష్టంభన ఏర్పడకముందు కలిగి నవి. ఇప్పటి హద్దులుదాటి ప్రాచ్యరాజ్య కూటమిగాని. పశ్చిమరాజ్య కూటమిగాని ఏమాత్రం విస్తరించుకోజూచినా, వెంటనే అది యుద్ధానికి కారణం అవుతుందికాబట్టి – ఇప్పు డింక అట్టిప్రయత్నాలు ఎవరికీ సాధ్యంకావు.

ప్రస్తుత పరిస్థితిని క్లుప్తంగా, సరళంగా చెప్పాలంటే – యిది : యుద్ధంవల్ల ఏమీ లాభంలేదనే సంగతి తెలిసినా కూడా, ప్రజలు యుద్ధానికే తలపడేటంత తీవ్రసమస్యలు కొన్ని ఉన్నాయి. అలాంటి సమస్యలకు పరిష్కారమార్గం వెతికి తీరాలి. ఉభయపక్షాలూ, నిజాయితీతో, మనః పూర్వకంగా – యుద్ధంవల్ల జయం సాధించే ఆశని వదలు

కుంటేతప్ప – ఇట్టి పరిష్కారం కుదరదు. ఈ సంగతినే ఉదాహరణ పూర్వకంగా చెబుతాను. అమెరికాలోసామాన్య పౌరులు వాల్‌స్ట్రీట్ పెట్టుబడిదారుల సంకెళ్ళలో నలిగిపోతున్నారనీ, రష్యా అందించబోయే స్వేచ్ఛా జీవనాన్ని వారు ఆనందంగా రెండు చేతులతో అందుకుంటారనీ కొందరు ప్రముఖులైన రష్యనులు నమ్ముతున్నారు; లేదా నమ్ముతున్నామని చెబుతున్నారు. అలాగే, రష్యాలో ప్రజలకు కమ్యూనిస్టు రాజ్యంయెడల విపరీతమైన అసహ్యం ఉన్నదనీ, ఆ నియంతృత్వ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి అవకాశం దొరికితే చాలు – వారు ఆనందంతో వినియోగించుకుంటారనీ అమెరికాలో చాలమంది నమ్ముతున్నారు; లేదా నమ్ముతున్నామని చెబుతున్నారు. కాని, యిలాంటి నమ్మకాలు ప్రభుత్వాల విధానాలలో ఉంటే చాలా ప్రమాదం. అప్పుడు ఎదుటి పక్షంవారిని, అవసరమైతే ఆయుధబలంతోనైనా ఎదుర్కోవాలని రెండుపక్షాలూ అనుకుంటాయి. భవిష్యత్తులో అంతటా కమ్యూనిజమే రావచ్చు. అంతటా అమెరికా జీవనవిధానమే రావచ్చు, అసలు రెండూ రాకపోవచ్చు. ఏమైనా, శాంతియుతమైన పద్ధతులలో తమ తమ విశ్వాసాలను ప్రచారం చేసుకోడానికి ఉభయ సిద్ధాంతాల అనుయాయులకూ స్వేచ్ఛ ఉండాలి. కాలక్రమాన ప్రపంచం అంతటా క్రైస్తవమతం వ్యాపిస్తుందని క్రైస్తవ మత ప్రచారకులు మనః పూర్వకంగా విశ్వసిస్తున్నారు. కాని, వారి ప్రచార ప్రయత్నాలకు సైన్యాల అండ కావాలని వారిలో ఎవరూ ఇప్పుడు అర్థించడంలేదు. అలాగే

ప్రస్తుత రాజకీయ సిద్ధాంతాల విషయంలోకూడా. సైనిక బలంతో ప్రపంచాన్నంతటినీ జయించాలనే కాంక్షను మనః పూర్వకంగా విడిచిపెట్టనంతకాలమూ – ఎవరి విశ్వాసాలను వాళ్ళు ప్రచారం చేసుకోడానికి నిరభ్యంతరంగా, అందరికీ, వీలుండాలి. ఇప్పుడు ప్రాచ్యరాజ్యాలకు పశ్చిమరాజ్యాలను చూస్తే భయం. పశ్చిమరాజ్యాలకు ప్రాచ్యరాజ్యాలను చూస్తే భయం. ఎదుటిపక్షం తన సైనిక బలంతో ప్రపంచాన్ని జయించేస్తుందనే భయం ఉభయపక్షాలకూ ఉండడమే యిందుకు కారణం. ఈ భయం మరీ నిర్హేతుకమయినదికాదు. నవీన ఆయుధాలవల్ల ఏపక్షమూ ప్రపంచ విజయం సాధించడం అసాధ్యంగా పరిణమించింది. కాబట్టి యీ కోరికను ఉభయులూ విడనాడడం – అందులోనూ, ఎదిరిపక్షానికి యిసుమంతైనా అనుమానం కలగకుండా ఉండేటంత చిత్తశుద్ధితో విడనాడడం – అత్యవసరం.

చిత్తశుద్ధి విషయంలో ఆరంభంలో చాలా చిక్కులున్నాయి. ఈ చిక్కులవలననే 1945 నుంచి. నేటిదాకా, అన్ని రాజీమార్గాన్వేషణలూ మొగ్గలోనే మాడిపోయాయి. "ఏ పక్షానికీ విజయం అక్కరలేదు. ప్రపంచశాంతి మాత్రమే కావాలి" అనే భావంతో ఉభయులూ పని చేస్తేనే—ఒకరిమీాద ఒకరికి విశ్వాసం క్రమ ప్రవృద్ధం అవుతుంది. ఈ విధమయిన విశ్వాసం కుదరడానికి మొట్ట మొదట చేయవలసిన పని ఉభయపక్షాలూ రహస్యాలను వదలుకోవడం. ఇది నిజాయితీకి మొట్టమొదటి దాఖలా

అవుతుంది. ఎదిరిపక్షంవారు వచ్చి, తమ సైనిక స్థావరాలను, ఆయుధాగారాలను స్వేచ్ఛగా చూడడానికి ఉభయ పక్షాలూ అనుమతిస్తే — రహస్యంగా యుద్ధంకోసం ప్రయత్నాలు చేస్తున్నారనే అనుమానం ఎవ్వరికీ ఉండదు. ఉభయపక్షి వివాదాలనూ తటస్థుల మధ్యవర్తిత్వానికి అప్పజెప్పడం ఇంతకన్నా తేలికయిన రెండవ చర్య. ఇవి ఆరంభంలో అవసరమయిన సూచనలు మాత్రమే. వీనిని గురించి తరువాతి అధ్యాయంలో ఇంకా ఎక్కువగా చెబుతాను.

ఉభయ పక్షాలమధ్యా సంభాషణలుకాని, ఒడంబడికలుకాని అక్కరలేని ఇంకొక చిన్నపని ఉన్నది. ఉభయ పక్షాల అధికారులూ, ప్రభుత్వాలూ ప్రభుత్వాలకు చూపించవలసిన మర్యాదను పాటించాలి. ఏ పక్షంవారు సుహృద్భావంతో చేసినట్టు కనిపించిన సూచననైనా సరే — మోసంతో కూడినదని ఎదిరి పక్షంవారు బహిరంగంగా ఆరోపించడం మానెయ్యాలి. తాము గొప్ప నిజాయితీ గలవారమనీ, చిత్తశుద్ధి గలవారమనీ గొప్పచెప్పుకోవడం ఉభయ పక్షాలకూ చాలాకాలంగా అలవాటయిపోయింది. అందువల్ల వాళ్ళకు తీవ్రంగా ఎదురు జవాబులు చెప్పకుండా ఊరుకోవడం వ్యవహర్తలకు మానవసాధ్యం కానంత కష్టమవుతోంది. ఎదిరిపక్షంపై దండెత్తుతామనే బెదిరింపులూ, ఎదిరిపక్షం వారు దెబ్బతీయడానికి సిద్ధపడుతున్నారనో, అట్టి అవకాశం ఉన్నదనో సూచించే ఆరోపణలూ చెయ్యడం తప్పు—అని

చర్చానిబంధనలలో చేర్చాలి. ఇట్టి బెదిరింపులవల్ల ఉభయ వర్గాలలో క్రోధోద్రేకాలు పెరగడమే కాకుండా, అధికారుల లోనూ ప్రజలలోనూకూడా శత్రుభయం నిరంతరం రాజు కుంటూఉంటుంది. కాని, ఈ నియమాన్ని పాటిస్తే ఉభయ పక్షాలమధ్య సంబంధాలు చాల మెరుగవుతాయనీ, అందు వల్ల చాలా సత్ఫలితాలు కలుగుతాయనీ నా విశ్వాసం.

# నిరాయుధీకరణ

అంతర్జాతీయ బాంధవ్యాలలో నిరాయుధీకరణ (లేక ఆయుధాలతగ్గింపు) అత్యంత ప్రధానమైన సమస్య అనీ, అందుచేత దానిని ముందుగా సాధించాలనీ భావించేవారు చాలామంది ఉన్నారు. నేనుకూడా ఆయుధాలతగ్గింపు ప్రముఖమయినదని భావిస్తాననీ, యుద్ధవ్యూహదృష్ట్యానైనా, రాజనీతి దృష్ట్యానైనా అణ్వాయుధాలను అసలు ఉంచరాదని అంటానని వేరే చెప్పనక్కరలేదు. కాని ఇదే ప్రధాన సమస్యగా భావించడానికి రెండు ఆటంకాలున్నాయి. ఒకటి: ప్రాక్పశ్చిమరాజ్యాల మధ్య బాంధవ్యాలు సుహృద్భావ సహితంగా ఉంటేతప్ప, నిరాయుధీకరణ సమావేశాలు ఫలవంతంకావు – అని గత పదమూడు సంవత్సరాల అనుభవం వల్లా రుజువవుతున్నది. రెండు : మానవజాతిని అణ్వాయుధాల బారినుండి రక్షించడమనే ప్రధానసమస్య అణ్వాయుధాలను విసర్జించాలనే అంగీకారం వల్ల వాయిదాపడుతుందే కాని పరిష్కారంకాదు. ఇట్టి ఒడంబడికలు వాటంతట అవి యుద్ధాన్ని ఆపలేవు. తీవ్రయుద్ధమేగాని వస్తే, ఏపక్షమూ పూర్వపు ఒడంబడికలకు కట్టుబడి ఉండదు. రెండు పక్షాలూ కొత్త అణ్వాయుధాలను వీలైనంత వేగంగా తయారు చేసుకుంటాయి. పై రెండు ఆటంకాలూ సురక్షితశాంతి కోసం అనుసరించవలసిన సుదీర్ఘ పథానికి రెండు చివరలా

ఉన్నాయి. మొదటి ఆటంకం ప్రభుత్వాలను శాంతిపథంలో ప్రయాణం చేయకుండా ఆపుతుంది. రెండవ ఆటంకం శాంతి గమ్యాన్ని ఇంచుమించు చేరుకునే పరిస్థితిలో ఆపథం నుండి పెడదారి పట్టిస్తుంది. ఈ కారణాలవల్ల ఉభయ పక్షాలూ నిరాయుధీకరణ ఒప్పందానికి వచ్చినా, అది తాత్కాలిక ఉపశాంతిదాయకమే గాని, పరిష్కారమార్గం కాదు.

అయినప్పటికీ నిరాయుధీకరణ ఒడంబడికవలన చాలా మేలుకలుగుతుంది. ప్రాక్పశ్చిమ రాజ్యాలమధ్య సంబంధాలు బాగుపడతాయనీ, అందరు వివేకవంతులూ ఆశించే సత్ఫలితాలు కలుగుతాయనీ ఇట్టి ఒడంబడిక వల్ల నమ్మకం కలుగుతుంది.

ఇదికాక, అణుయుద్ధం సంభవించే ప్రమాదం చాల వరకు తగ్గడం ఇందువల్ల కలిగే రెండవ మేలు. తక్షణ ప్రతీకార చర్యకు ఉభయపక్షాలూ సర్వసన్నద్ధంగా ఉన్న ఇప్పటి స్థితిలో – ఆకస్మికంగా జరిగిన ఏ దురదృష్టకర సంఘటన అయినా – ఉదాహరణకి ఏ ఉల్క తగిలి హైడ్రోజన్ బాంబు పేలినా – అది శత్రుచర్యయే అని అవతలిపక్షం భావించే ప్రమాదం ఉంది. ఏదైనా అగ్రరాజ్యం అణుయుద్ధం ప్రారంభిస్తే మొట్టమొదట శత్రుదేశపు రాజధానీ నగరాన్ని నాశనం చేస్తుందని (బహుశః సరిగానే) భావిస్తున్నారు. కాబట్టి, యుద్ధం ఆరంభం అయినవెంటనే చిన్నచిన్న సేనాధిపతులు ప్రభుత్వం దగ్గరనుంచి ఇంకా ఆజ్ఞలు వస్తా

యని ఎదురుచూస్తూ కూర్చోకుండా, ప్రమాదపరిస్థితిని ఎదు ర్కోడానికి అంతకుముందే ఏర్పరచిన పథకాన్ననుసరించి ప్రతీకారచర్యలు చేయాలన్నమాట. ఉల్కతో ఢీకొనడం కంటె ఎక్కువ సంభవమయిన ఎన్నో కారణాలవల్ల ఏ అగ్ర రాజ్యమూ తలపెట్టకుండా యుద్ధంరావచ్చు. రాడార్ యంత్రంలో ఏదేనా పొరపాటువలన యుద్ధం రావచ్చు. భయంకరమైన బాధ్యతవలని నిరంతరభారంతో హఠాత్తుగా నరాలపట్లు సడలిపోయిన ఏ ప్రధాన సేనాధికారియైనా యుద్ధాన్ని తెచ్చిపెట్టగలడు. చాలాదేశాలకు అణ్వాయు ధాలు ఉంటే యుద్ధంరావడానికి ఇంకా ఎక్కువ అవకాశ మున్నది. బాధ్యతలేని ఏ పిచ్చిప్రభుత్వమైనా అణ్వాయుధా లతో దాడి ఆరంభిస్తే ఆ దాడి అగ్రరాజ్యమే చేసిందని భావించి – ఆ పొరపాటు తెలుసుకోక ముందే – ప్రతీకార చర్యకు పూనుకోవచ్చు. ఇన్ని కారణాలవల్ల ప్రస్తుత పరి స్థితిలో నిరంతరం యుద్ధప్రమాదం కన్పిస్తూఉంది. ఇంకా ఎక్కువ రాజ్యాలు అణ్వాయుధాలు తయారుచేసుకుంటే, ఈప్రమాదం ఇంకా ఎక్కువవుతుంది. నిరాయుధీకరణ ఒడంబడిక వల్ల ఇట్టి ప్రమాదం చాలవరకు తగ్గుతుంది.

ఇదీకాక, ఆర్థిక కారణాలవల్ల కూడా ఆయుధాలు తగ్గించుకోవడం అవసరం. ధనవ్యయాన్ని తగ్గించాలనే ప్రయత్నం ఎంత అవసరమో రాబోయే కొద్దిసంవత్సరాలలో తెలుస్తుంది. నానాటికీ పెరిగిపోతున్న సైనికవ్యయాన్ని భరించలేక పశ్చిమ ప్రభుత్వాలు తమ రక్షణకు అణ్వాయు ధాలు చాలునని ఈ మధ్యనే తలపోస్తున్నాయి. అణు

యుద్ధంలో అమెరికా తట్టుకోడానికి వీల్లేని దెబ్బతింటుందని. అందుచేత అణుయుద్ధాన్ని ప్రేరేపించడానికి అమెరికా ఎప్పుడూ జంకుతూనే ఉంటుందనీ, ఈ కారణంచేత అమెరికా రక్షణ అంతా అణ్వాయుధాలమీదనే ఆధారపడి ఉండడం ప్రమాదకరమనీ నిపుణులు ఒకప్రక్క సవాలుచేస్తున్నారు. పశ్చిమ రాజ్యాలవారు ప్రాచ్యరాజ్యాలవారిని అదుపులో ఉంచాలంటే అణుబాంబులు లేకుండా యుద్ధం చేయగలిగి ఉండాలి అని వారి భావం. అట్టి యుద్ధాలు చేయగలగాలంటే సైనిక వ్యయాన్ని విపరీతంగా పెంచాలి. ఆయుధాలపోటీ ఇలా సాగుతున్నంతకాలం, చావుబ్రతుకుల సమస్యగా ఉభయ పక్షాలూ ఒకరిని మించి ఒకరు ఆయుధాలు తయారు చేస్తున్నంతకాలం, క్రొత్త శాస్త్రీయ పరిశోధనల ఫలితంగా సైనిక వ్యయం నిరంతరం ఎక్కువవుతూనే ఉంటుంది. చివరకు ఉభయ పక్షాలప్రజలకూ తినడానికి తిండి కూడా కరువయ్యే పరిస్థితి వస్తుంది. ఎదుటి పక్షపు ప్రజలను చంపడంకన్నా తనవారిని బ్రతికించుకోవడం ఎక్కువ ప్రయోజనకరమని ఉభయులూ గుర్తించడమే ఈ స్థితినుండి తప్పించుకోడానికి మార్గం.

నిరాయుధీకరణకు ఒప్పందం కుదిరితే తత్ఫలితంగా యుద్ధంవల్ల కాని, బెదిరింపులవల్ల కాని వివాదాలు పరిష్కరించుకో వచ్చునని భావించడం మాని, మధ్యవర్తిత్వం ద్వారానూ, అంతర్జాతీయ సంఘాల ద్వారానూ వాటిని పరిష్కరించుకోవలసిన అవసరాన్ని ఉభయపక్షాలూ గుర్తించ వచ్చు. నిరాయుధీకరణవలన సమకూడే నాల్గవ ప్రయోజనం ఇది. ఏ వివాదమైనా యుద్ధంవల్లనే పరిష్కారం

కావాలంటే, గెలవడానికి అవసరమైన శక్తినంతటినీ ధార పోయవలసి వస్తుంది. నిరాయుధీకరణ ఒడంబడిక జరిగితే, ఆ ఒడంబడిక మన్నించబడినంతకాలమైనా ప్రభుత్వాలు తమ శక్తి నంతటినీ యుద్ధ ప్రయత్నాలకోసం వ్యయం చెయ్యకుండా ఉంటాయి. తప్పనిసరిగా, అందువల్ల వివాద పరిష్కారానికి కొత్తమార్గాలు అన్వేషిస్తాయి.

ఆయుధాల తగ్గింపు వాంఛనీయమని అంగీకరించిన తరువాత, మనం ఎదుర్కోవలసిన గడ్డుసమస్యలు చాలా ఉన్నాయి. నిరాయుధీకరణ సమావేశాల కార్యకలాపాలు పరిశీలించిన వారెవరైనా—సాంకేతిక సమస్యల గందరగోళంలో చిక్కుకోకుండా తప్పించుకో గలగడం ఇంచుమించు అసాధ్యం. ప్రతి సమస్యకూ సకారణమైన అభ్యంతరాలు ఒక వైపునుండి, అంతే సకారణమైన జవాబులు ఎదుటివైపు నుండీ వస్తూనే ఉంటాయి. ప్రాక్ పశ్చిమ రాజ్యాల మధ్య వైషమ్యం ఇలాగే ఉన్నంతకాలమూ, మనం ఈ గందరగోళాన్ని తప్పించుకోలేము. అణ్వాయుధాల నన్నిటినీ నిషేధించడానికి పాశ్చ్యరాజ్యాలు అంగీకరిస్తా యనుకోండి,'' అప్పుడు ''మీకున్న అధిక సంఖ్యాక సైనికబలంతో మాకన్నా మీరు బలవంతు లౌతారు. అణ్వాయుధాలతో పాటు మీరు సామాన్య సైన్యాలను కూడా తగ్గించుకుంటే తప్ప, మేము ఈ పథకానికి అంగీకరించము'' అని పశ్చిమ రాజ్యాలు అంటాయి. ప్రాచ్యరాజ్యాలు అందుకు కూడా అంగీకరించాయనుకోండి, తరువాత వచ్చే ప్రశ్న—సైన్యాలను ఎంతవరకు తగ్గించాలి ?—అని. ఈ విషయమై కూడా

అంగీకారం కుదిరితే అప్పుడు తలఎత్తే చిక్కు సమస్య—ఈ ఒప్పందాన్ని ఉభయపక్షాలూ అనుసరిస్తున్నాయని ఎలా తెలుస్తుంది? అందుకు అంగీకారమయిన పరిశీలన ఎలా చెయ్యాలి? అని. ఇలాంటి సమస్యలను ఉభయపక్షాల వారూ అనంతంగా చర్చిస్తూ, నిరాయుధీకరణను గురించి వాదించుకుంటూ, ఆయుధాలు తగ్గించుకో వలసిన ప్రమాణం మాత్రం ఇంతవరకూ రాకుండా చేసుకున్నారు. అందుచేత నిరాయుధీకరణ సంభాషణలు ఫలవంతం కావాలంటే ఉభయపక్షాలవారూ ఎదుటి పక్షానికి విజిగీష లేదనే విశ్వాసం కుదుర్చుకోవాలి.

ఉభయ పక్షాలకూ తక్షణం ఆచరణ సాధ్యమైన పని ఒకటి ఉన్నది – అణ్వాయుధ పరీక్షలను ఆపుచేయడం. ఉభయపక్షాలకు పెద్ద అభ్యంతరకరం కాని పర్యవేక్షణ విధానానికి అంగీకరిస్తే, ఒకరికి తెలియకుండా ఒకరు అణ్వాయుధ పరీక్షలను చేయడం సాధ్యంకాదని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అందువల్ల ఈపరీక్షలను ఆపుచేయడం విషయమై అంగీకారం కుదరడం కష్టంకాదు. అణ్వాయుధపరీక్షలను ఆపడం చిన్నచర్య అయినప్పటికీ దానివలన చాలా ప్రయోజనకరమయిన ఫలితాలే కలుగుతాయి. ఆహారంలోనూ, నీటిలోనూ, గాలిలోనూ కలిసే రేడియోధార్మిక పదార్థం తగ్గి, ఇప్పుడువస్తున్న పుట్టకురుపు, ల్యుకేమియా మొదలయిన వ్యాధులు తగ్గుతాయి. అదీకాక, ప్రాక్ పశ్చిమరాజ్యాల మధ్య ఏఅంగీకారమైనాసరే వైరభావ కలుషితమైన ప్రస్తుత వాతావరణాన్ని బాగుచేస్తుంది. అణ్వా

యుధాల పరీక్షలు ఆపితే. ఇప్పటికింకా అణ్వాయుధాలు తయారుచేసుకోని కొత్తరాజ్యాలు "అణ్వాయుధ సంఘం" లో చేరడం కష్టంఅవుతుంది. ఇన్నికారణాలవల్ల అణ్వాయుధ పరీక్షలు నిషేధిస్తారని మనమంతా మనఃపూర్వకంగా ఆశించాలి.

నిరాయుధీకరణ కావాలని ఏప్రభుత్వమూ మనః పూర్వకంగా కోరుకోవడంలేదు. ఇదికాక నిరాయుధీకరణకు ఇంకొక పెద్దచిక్కు పర్యవేక్షణకు సంబంధించినది. ఈవిషయమై చాలామంచి పుస్తకమొకటి ఉన్నది – "నిరాయుధీకరణ పర్యవేక్షణ." * సంపాదకుడు : సేమూర్ మెలన్; కొలంబియా యూనివర్సిటీప్రెస్, న్యూయార్కు – 1958. నేను చెప్పగలిగినంత వరకు ఈపుస్తకంలో ఉన్న పరిశీలనలన్నీ చాలా నిజాయితీతో చేసినవి; ఉన్నవిషయాలను, రాగల పరిస్థితులను ధర్మంగా అంచనా వేయాలనే లక్ష్యంతో చేసినవి. స్థూలంగా చెప్పాలంటే ఈపుస్తకంలో చెప్పిన విషయం ఇది : అంతర్జాతీయ పర్యవేక్షణవల్ల కొత్త అణ్వాయుధాల నిర్మాణం ఆపుచేయవచ్చు; కాని. మోసకారి ప్రభుత్వాలు దాచిపెట్టిన పాత ఆయుధాల నిల్వలు బైటపెట్టలేకపోవచ్చు. మొదటి ప్రపంచయుద్ధం అయిపోయిన తరువాత జర్మనీ ప్రభుత్వం వెర్సైల్స్ సంధి ఒప్పందాలకు విరుద్ధంగా వ్యవహరించి తాను తయారుచేసిన ఆయుధాలను ఎవ్వరికీ తెలియకుండా దాచిపెట్టిన రహస్యపద్ధతుల వివరాలన్నీ ఈ

* *Inspection for Disarmament* — Edited by Seymour Melon; Published by Columbia University Press—1958.

పుస్తకంలో ఉన్నాయి. కాని, ఆసంధి ఒడంబడికలో ఉన్న షరతులకు జర్మనీపరిభుత్వం మనఃపూర్వకంగా అంగీకరించ లేదనీ, ఓడిపోయింది కాబట్టి ఒప్పుకోక తప్పక ఒప్పు కుందనీ ఈసందర్భములో మనం గుర్తుపెట్టుకోవాలి. నిరా యుధీకరణ ఒడంబడిక మీద సంతకాలు పెట్టేవారందరూ - తమ క్షేమంకోసమే ఆ ఒడంబడికను ఆమోదిస్తున్నామనీ, తమ శత్రువుల ప్రయోజనంకోసం ఆపని చెయ్యడంలేదనీ నమ్మి, మనఃపూర్వకంగా సంతకాలు పెడితే తప్ప, ఏనిరా యుధీకరణ ఒప్పందమూ నమ్మదగినదిగా ఉండదు. ప్రాక్ పశ్చిమ రాజ్యాలమధ్య హృదయ పూర్వక బాంధవ్యాలు ఏర్పడడం మూలంగానే నిరాయుధీకరణ సాధించబడాలి గాని, ముందు ఒప్పందంజరిగి, తత్ఫలితంగా హృదయపూర్వక బాంధవ్యాలు ఏర్పడడం కల్ల - అన్న మనపూర్వ విశ్వాసం ఇందువల్ల బలవత్తరమవుతుంది.

ఉభయపక్షాలూ మనఃపూర్వకంగా శాంతిని కోరు కుంటే, ఇంక కొత్త అణ్వాయుధాలు తయారు చేయబోమని ఒప్పందానికి రావడం కష్టంకాదు. ఈ నియమాన్ని ఉభ యులూ అనుసరిస్తున్నారో లేదో అంతర్జాతీయ పర్యవేక్షణ వలన తెలుసుకోనడం అంతకన్నా కష్టంకాదు. సైబీరియా, అలాస్కాలవంటి దూర ప్రాంతాలలోనైనా, పెద్దపెద్ద ఆయు ధాగారాలు నిర్మించి రహస్యంగా ఆయుధాలు తయారు చేయడం ఆకాశ పర్యవేక్షణలవల్ల అసాధ్యమౌతుంది. ఇప్పటికే ఉన్న హైడ్రోజన్ బాంబులను ధ్వంసం చేయడం దీని తరువాత చేయవలసిన పని. కాని అందులో కొన్ని

చిక్కు లున్నాయి. ఇప్పుడు ఉభయపక్షాలకూ ఉన్న ప్రాబల్యతౌల్యానికి భంగం రాకుండా ఉండాలంటే దీనికి తోడు సామాన్య సైన్యాలను కూడా తగ్గించుకోవలసి రావచ్చు. యుద్ధాన్ని రాజనీతిలో ఒక ఉపాయంగా ఉపయోగించే పద్ధతిని పూర్తిగా వదులుకుంటేతప్ప ఈ విషయంపై ఒప్పందం కుదురుతుందని నేననుకోను.

ఇంతవరకు మనం చర్చిస్తున్న నిరాయుధీకరణచర్యల వల్ల కలుగబోయే మంచి మార్పులను గురించి కొద్దిగా చెపుతాను. యుద్ధంవలన మానవజాతికి సంభవించబోయే ఘోరవిపత్తును గురించి తెలిసిన వారందరి మనస్సులలోను ఉన్న దుర్భర భయభారం తొలగిపోతుంది. నాగరిక ప్రపంచమంతటా సంతోషాహ్లాదాలు కట్టలు తెంచుకుని పొంగిపోతాయి. ఇంతవరకు విద్వేషంతో, వినాశనకాంక్షతో, వ్యర్థమైనాన్ని పెంపొందించడానికి వ్యయంచేసిన శక్తి ఇక ముందు నిర్మాణయుతమార్గాలలో ప్రవహించి, కలకాలం నుంచి కష్టంతో, దారిద్ర్యంతో క్రుంగిపోతున్న అనేక దేశాలకు సౌభాగ్య సంతోషాలను సమకూరుస్తుంది. శత్రుభయ శృంఖలా బద్ధములై అణగిఉన్న దయ, సోదర భావము, సానుభూతి మొదలయినవి నూతన శక్తితో వెల్లివిరిసి, మానవ వ్యవహారాలపై ప్రభుత్వాన్ని సంపాదించుకుంటాయి. ఇది అంతా సాధ్యమే. ఇందుకు చేయవలసినదల్లా—మానవులు అనవసర భయంవల్ల దూరం చేసుకున్న ఆశాస్వాతంత్ర్యాలను తమకు తాము ప్రసాదించుకోవడమే.

# పరిష్కారసాధనాలు

అణుయుద్ధం ఇరుపక్షాలకూ విపత్కరమేననీ, శాంతి పరిరక్షణ, సాధ్యమైతే సర్వదా వాంఛనీయమనీ ప్రాక్ పశ్చిమరాజ్యాలు ఉభయులూ అంగీకరించా యనుకుందాం. అయినా శాంతియుతమైన విధానానికి చాలా ఆటంకా లున్నాయి. మొదటిదీ, అత్యంత ప్రమాదకరమైనదీ పరస్పరభయం; అవతలివారు విశ్వసనీయులు కారేమోననే అనుమానం. రెండవది—తమ ప్రతిష్ఠ దెబ్బ తింటుందేమో ననే భయం. ఎదుటిపక్షపు షరతులకు లొంగక తప్పని స్థితిలో ఉన్నట్టు కనిపించడం ఏ పక్షమూ సహించలేదుకదా! మూడవ ఆటంకం—ఉభయ పక్షాలమధ్య ఉన్న సిద్ధాంత విభేదం. దీనిని అతి ప్రముఖంగా చెబుతున్నారుకాని, నా దృష్టిలో ఇది అంత తీవ్రమయినదిగా కన్పించదు. తమపక్షం మంచిదని విశ్వసించే జీవనవిధానం అవతలి పక్షంవారి జీవన విధానంకన్నా చాలా గొప్పదనీ, అందుచేత అవతలి పక్షానికి ప్రపంచ విజయం లభించే అవకాశం ఎట్టి పరి స్థితులలోనూ ఇవ్వరాదనీ ఉభయపక్షాలలోను చాలామంది విశ్వసిస్తున్నారు. ఉభయపక్షాలమధ్య స్నేహం పొసగించా లనే ఉద్దేశ్యంతో తయారుచేసిన ఏ పరిష్కార పథకంలో నైనా ఈ ఆటంకాలన్నిటినీ తప్పించుకోడానికి మార్గాలు చూపించాలి. అప్పుడుగాని, అట్టి పథకానికి అగ్రరాజ్యాల

ఆమోదం లభించదు. అట్టి పథకం తయారుచేస్తారో లేదో నాకు తెలియదు. ఒకవేళ తయారుచేసినా, అందులోని పరిష్కారమార్గాలు ఏరూపంలో ఉంటాయో నేను చెప్ప లేను. కాని, అట్టి పరిష్కారాలకై అనుసరించవలసిన పద్ధతులను గురించి యిక్కడ కొన్ని సూచనలు చేస్తాను. ఇదే లక్ష్యంగల యితరసూచనలు ఏవన్నా ఉండి, అవి ఇంత కన్నా ఎక్కువ ఆమోదయోగ్యం అయితే, నా సూచనలనే అనుసరించాలని నేను కోరను.

మొట్టమొదటి చర్య: ఉభయపక్షాలలోని రాజ్యాలూ, ఇంకా ఇతరులెవరయినా చేరదలచుకుంటే వారూ కలిసి, యుద్ధం ఎవ్వరికీ ప్రయోజనకారి కాదనీ, అందుచేత దానిని నిరోధించడానికి తక్షణచర్యలు అవసరమనీ ఒక ప్రకటన చెయ్యడం. దీనితోపాటుగాగానీ, లేక తరువాతగానీ "యథాస్థితి సంరక్షక ప్రకటన" ఒకటి చెయ్యాలి. ఒక నియమితకాల వ్యవధివరకూ – ఉన్నపరిస్థితిని మార్చబోమనీ, ఎవ్వరినీ యుద్ధానికి కవ్వించబోమనీ అందరూ ఆ ప్రకటనలో ఒప్పుకోవాలి.

తరువాతిచర్య ఒక మధ్యవర్తి సంఘాన్ని నియమించడం. ఆసంఘానికి అధికారాలు ఉండనక్కరలేదు. ఉభయులమధ్యా వైరభావాన్ని తగ్గించడానికి, ఈసంఘం సాధ్యమయిన ఉపాయాలు అన్వేషిస్తేచాలు.

చర్చలు ప్రయోజనకరంగా సాగాలంటే, ఇందులో ఎక్కువమంది సభ్యులుండకూడదు. ఇద్దరు అమెరికనులు,

ఇద్దరు రష్యనులు, పశ్చిమ యూరపు ప్రాంతీయుడొకడు. ఒక చైనాదేశీయుడు, ఇద్దరు తటస్థులు ఉంటే బాగుంటుందని నాసూచన. ఈ ఇద్దరు తటస్థుల్లో ఒకడు భారతీయుడు, ఇంకొకడు స్వీడన్ దేశీయుడు అయితే లాభకరం. అందువల్ల మొత్తంమీద ఇద్దరిలో ఒకడు ప్రాచ్యరాజ్యాలపై మొగ్గు చూపితే, ఇంకొకరు పశ్చిమ రాజ్యాలవైపు మొగ్గుతాడు. ఈ ప్రతినిధులందరూ తమతమ ప్రభుత్వాల విశ్వాసాన్ని పొందినవారై ఉండాలి. లేకపోతే వీరిమాటకు అక్కడ విలువ ఉండదు. చర్చాకాలం తక్కువరోజు లుండదు కాబట్టి, అన్నాళ్లూ వీరికి వేరే బాధ్యతలుండకూడదు. ఈరోజులలో ఒక చిక్కు ఏమిటంటే – రాజనీతి నిర్ణేతలు అనేక వ్యవహారాల్లో మునిగిఉండడం. అందువల్ల, రాజనీతిని నిర్ణయించడానికి తప్పనిసరి అయిన కొద్ది విషయాలనూ మినహాయించి మిగిలిన వివరాలను తెలుసుకోవడానికి కావలసిన తీరిక వారికి ఉండడంలేదు. మధ్యవర్తి సంఘంలోని సభ్యులకు మాత్రం ఇట్టిబాధ లేకుండా ఉండాలంటే, వారికి పరిపాలనా భారంగాని, ప్రజాభిప్రాయ భారంగాని ఉండకూడదు.

సంఘంలో సభ్యులందరూ చర్చలకోసమే సమావేశమయినప్పటికీ, ఆ తరువాత సరదాగాకూడ కలుసుకుంటూ ఉండడం మంచిది.

కొంతకాలం పాటు చర్చలు సాగినతరువాత, ముగ్గురు ప్రాచ్యరాజ్యాల సభ్యులకూ పశ్చిమ రాజ్యాల సభ్యులు ముగ్గురితో తీవ్రమైన అభిప్రాయభేదాలు వచ్చి,

చర్చ లేకాకుండా, మామూలుగా మాట్లాడుకోవడం కూడా అసాధ్యమయ్యేటంత పరిస్థితి వస్తే – అప్పుడు ఈ ఇద్దరు తటస్థరాజ్యాల సభ్యులూ వారిని కాస్త ప్రశాంతపరచి, మళ్లా మాట్లాడుకునేటట్లు చేయాలి. మనం సాధించవలసినది అంగీకారమే కాని ఎవరిమటుకు వారికి రాజకీయ విజయం కాదనే విశ్వాసం సభ్యులందరికీ, మొదటనుంచీ ఉండాలి. చర్చలు రహస్యంగా సాగించడం మంచిది. అందరు సభ్యులూ ఏకగ్రీవంగా అంగీకరిస్తేనే తప్ప ఏవిషయాన్నీ బయటకు ప్రకటించకూడదు. ఈ నియమాన్ననుసరించకపోతే స్వేచ్ఛగా సభ్యులు పరిష్కార సూచనలు చెయ్యడానికి గాని, వాటిని ఉపసంహరించుకోడానికిగాని వీలుండదు. అంతేగాక ఈ నియమం లేకపోతే, సభ్యులు తమ దేశప్రజలకు హర్ష దాయకమయిన చమత్కారపదాలు వాడకుండా మానుకోవడం కష్టం అవుతుంది. ఈసంఘంలో ఏకగ్రీవాంగీకారం కుదిరితే మాత్రం దానిని ప్రపంచమంతటా విరివిగా ప్రచారం చెయ్యాలి.

ఏ ఒడంబడికకైనా ఉండవలసిన లక్షణాలను కొన్నిటిని ముందే నిశ్చయించాలి. ఏపరిష్కార మార్గం వలనా ఒకపక్షానికి రెండవపక్షం కన్నా అధికతర ప్రయోజనం కలగకూడదు. ఈనియమం అత్యంత ప్రధానమైనది. లేకపోతే ఇట్టి పరిష్కారమార్గం కన్నా యుద్ధమే అనుసరణీయమనే భావానికి ఏపక్షమయినా లొంగిపోవచ్చు. ప్రతిసూచనను పరిశీలించి. దానివలన ఉభయపక్షాలకూ సమాన లాభాలున్నాయని తమకు నమ్మకం కలిగిన తరువాతనే, ఆ

సూచనను ఉభయులచేత ఆమోదింపజేయడానికి ప్రయత్నించడం తటస్థసభ్యుల పని. అంగీకారం కుదరడం కష్టమయిన విషయాలపై అభిప్రాయభేదాల తీవ్రతనైనా తగ్గించడానికి ప్రయత్నించాలని ఈసంఘంలో ఇంకొక నియమం ఉండాలి. ఇరుపక్షాలకు మధ్యగల వైరభావం వలన వివిధవిషయాలపై అభిప్రాయభేదాలు మరీ తీవ్రమవుతున్నాయి. వైరభావం తగ్గించుకో గలిగితే. చాలా విషయాలపై అంగీకారం సులభసాధ్యమవుతుంది. పై రెండు నియమాలకన్నా కొంచెం తక్కువ ప్రాముఖ్యం కలదే అయినా మూడవనియమం – వీలైనపుడల్లా వివిధప్రాంతీయుల అభీష్టాలను మన్నించడం. చాలా కారణాలవల్ల యిది సర్వత్రా సాధ్యంకాదు. ఒక విచిత్రమైన ఉదాహరణ తీసుకొని చూద్దాం. పనామా రాష్ట్రంలో కమ్యూనిస్టులు అధికసంఖ్యాకులుగా ఉన్నంత మాత్రాన అమెరికా ప్రభుత్వం పనామాకాలువను మాస్కో సోదరులకు దత్తంచేయాలని మనం అనలేము. అభిప్రాయభేదాలు రెచ్చిపోయే ప్రమాదం ఉందికాబట్టి, యింతకన్నా ఇతర ఉదాహరణలు ప్రస్తుతానికి యివ్వను.

కొంతకాలంపాటు చర్చలు కొనసాగిన తర్వాత ప్రాక్ పశ్చిమ రాజ్యాలమధ్య భేదాభిప్రాయాలున్న ప్రధాన విషయాలను గురించి ఈ సంఘంవారు ఒక అంగీకార పత్రపు ముసాయిదాను తయారు చేస్తారని ఆశిస్తున్నాను. ఈ సంఘంవారు సూచించిన ప్రతిపాదనల కన్నింటికీ, ఏ ప్రభుత్వమూ ముందుగానే ఆమోదం తెలియపర్చాలని నేను అనడంలేదు. కాని, ఈ ప్రతిపాదనలు నిష్పక్షపాతమైనవీ,

ఏ ప్రభుత్వానికీ నష్టం కలిగించనివీ అయిఉండే అవకాశం ఉందికాబట్టి. వీటిని ప్రపంచ మంతటా ప్రచారంచేస్తే, తత్ఫలితంగా వివేకవంతులైనవారి అభిప్రాయాలు తొందరలో ఒకరూపానికి వస్తాయి. అంతేకాక ప్రాక్ పశ్చిమరాజ్యాల ప్రతినిధులు ఆమోదించిన ఒక ముసాయిదా ఒడంబడిక రూపొందించవలసి ఉంటే ఈ అభిప్రాయంలో చాలా గాఢమయిన పరిణామాలు సంభవిస్తాయి.

ఏ ప్రత్యేక వర్గానికో అనుకూలురనే నిందలేకుండా శాంతిని సమర్థించే అవకాశం శాంతికాముకు లందరికీ లభిస్తుంది.

నేను సూచించిన పద్ధతిలో ఏర్పాటయిన సంఘం అసలు ఏవిధమైన అంగీకారానికైనా రాగలదా అని చాలా మంది శంకిస్తారు. ప్రాక్ పశ్చిమ రాజ్యాల మధ్యనున్న అగాధం అనుసంధించడానికి వీలులేనంత అపారమైనదనీ, చర్చలవల్ల అది అసలే సాధ్యంకాదనీ, ఒకవేళ యీ సంఘం ఒక ఒప్పందానికి రావడమే సంభవించినా, ప్రభుత్వాలు దానిని అంగీకరించవనీ చాలామంది వాదిస్తారుకాని అణు యుద్ధ ప్రమాదం పూర్తిగా బోధపరచుకుంటే యిలా జరగ దని నా అభిప్రాయం. ఉభయపక్షాలూ తమకు రాబోయే విపత్తును గ్రహిస్తే అప్పుడు వారు ఒక ఒప్పందానికి రావడం మనం అనుకున్నంత కష్టంకాదు. ఒక అర్ధశతాబ్దికి పూర్వం జరిగిన సంఘటనను దీనికి ఉదాహరణగా చెప్పవచ్చును. బ్రిటనుకు రష్యాకు ఒక అర్ధ శతాబ్దానికి పూర్వం ఒకరి

యెడల మరొకరికి విపరీత భయం ఉండేది. కాని, 1907 నాటికి ఉభయులకూ పరస్పర భయంకన్నా జర్మనీఅంటే భయం ఎక్కువయింది. అప్పుడు వారు తమ అభిప్రాయ భేదాలు విస్మరించి స్నేహితులైనారు. ఇదువరకూ జర్మనీ అంటే ఉన్న ఉమ్మడిభయంవల్ల ఇలా జరిగింది. కాని, ఆ భయం ఇప్పటి అణుయుద్ధ భయంకన్నా చాలారెట్లు తక్కువ. అణుయుద్ధంవలన మానవజాతి కంతటికీ విపత్తు కలుగుతున్న దని గుర్తించకుండా, అందువల్ల ఏవో కొన్ని దేశాలకు మాత్రం నష్టం కలుగుతుందని అనుకోవడం చాలా దురదృష్ట కరమయిన విషయం. ప్రాచ్యరాజ్యాలు పశ్చిమరాజ్యాల ఆయుధాలను చూచి భయపడుతున్నాయి. పశ్చిమరాజ్యాలు ప్రాచ్యరాజ్యాల ఆయుధాలనుచూచి భయపడుతున్నాయి. కాని, ఉభయపక్షాల ఆయుధాలూ, ఉభయపక్షాలకూ సమాన భయంకరములే అన్న విషయాన్ని ఉభయపక్షాలూ విస్మరిస్తున్నాయి. పరిశీలించగల విరామం ఉండి, వారివారి దేశాల విదేశాంగశాఖల అహంకారాలకు లోనుకానివారం దరికీ యీ విషయం తేలికగా బోధపడుతుంది. దీన్ని ఉభయ పక్షాల రాజనీతిజ్ఞులూ గుర్తిస్తే, వారిమధ్య విభేదాలను తొలగించడం అసాధ్యం కాదనీ, 1907 లో రష్యా బ్రిటనుల మధ్య విభేదాలు సమసిపోయినట్లే వీరి అభిప్రాయ భేదాలు కూడా సమసిపోతాయనీ బోధపడుతుంది. ఈ కారణాల వలన నేను సూచించిన మధ్యవర్తి సంఘువ్యవహారాల ఫలితం విషయంలో నాకు నిరాశ లేదు.

ఎనిమిది

# సరిహద్దుల సవరణలు

నేను పూర్వపు అధ్యాయంలో సూచించిన పరిష్కార సంఘం చేయవలసిన, ప్రధానమయిన, కష్టమయిన పని ఒకటి ఉంది. ప్రపంచశాంతిదృష్ట్యా వివిధ ప్రాంతాల సరిహద్దులను మార్చవలసిన పద్ధతిని గురించి వారు సూచనలు చేయవలసి ఉంటుంది. ఇది ఎంతవరకూ సాధ్యమో నేను చెప్పలేను. కాని, వారు చేయవలసిన సూచనలుమాత్రం చాలా తాత్కాలికమైనవై ఉండాలి. తరువాత చర్చలలో వాటిని తీవ్రంగా మార్చవలసి రావచ్చును. ఇంత అనిశ్చితమయిన సూచనలయినా వీటివలన లాభం ఉంటుంది. శాంతికాములు ఆమోదించడానికి అనువైన ప్రపంచపటాన్ని తయారు చేసినట్లవుతుంది. ఇందులోని ప్రధానసమస్యలను మూడు భాగాలు చెయ్యవచ్చు: (1) యూరప్ (2) మధ్యప్రాచ్యం (3) దూరప్రాచ్యం.

## 1. యూరప్ :

యూరప్ అంతటా ఇప్పుడు యుద్ధభయం అలుముకొని ఉంది. పశ్చిమ యూరప్‌లో ప్రస్తుతం అమెరికా సైన్యాలు రష్యాతో యుద్ధంకోసం కాచుకొని ఉన్నాయి. పశ్చిమ రాజ్యాలు తామై యుద్ధాన్ని ప్రారంభించవు అని హామీ మనకు ఉంది కాని, ప్రాచ్యరాజ్యాలు మామూలు యుద్ధం ప్రారంభించినా, దానికి పశ్చిమరాజ్యాలు అణ్వాయుధా

లతో సమాధానం చెబుతాయని ప్రకటిస్తున్నారు. తూర్పు యూరప్‌లో రష్యా కమ్యూనిష్టు ప్రభుత్వాలను ఏర్పరచింది. అమెరికా ఉపగ్రహరాజ్యాలలో కనీసం కొన్నిట్లోనైనా కమ్యూనిష్టు వ్యతిరేకులు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. రష్యా ఏర్పాటుచేసిన ప్రభుత్వాలు రష్యా సైన్యాల అండ వలన అధికారంలో ఉండగలుగుతున్నాయి. ఈ రకంగా యూరప్ నంతటినీ రెండు వాటాలు చేసుకొని తూర్పుభాగం ఒకరు, పశ్చిమభాగం ఒకరు పంచుకొన్నారు. సుస్థిరమయిన శాంతి కలుగుతుందనే ఆశపుట్టాలంటే, అమెరికా రష్యాల మధ్య తటస్థప్రాంతపు గోడ నొకదానిని నిర్మించి ఆ రాజ్యాలను స్వేచ్ఛగా వ్యవహరించే హక్కును ప్రసాదించాలి.

ఇందుకోసం చెయ్యవలసిన పని ఒకటి ఉంది. ప్రాక్ పశ్చిమ రాజ్యాలలో ఏదైనాసరే యింకొక స్వాతంత్ర్యరాజ్యంలో తన సైన్యాలను ఉంచకూడదని ఉభయులూ ఒప్పందానికి రావాలి. అంటే రష్యా, అమెరికాలు రెండూకూడా చాలా తీవ్రమయిన త్యాగం చేయవలసి రావచ్చు. ప్రస్తుతం రష్యాపైకి సరాసరి అణుబాంబులను పంపించే అవకాశాలు అమెరికాకు లేవు. అందుకు బ్రిటన్ సహాయంకాని, యూరప్‌లో యితర దేశాలసహాయంకాని కావలసిందే.

ఇట్టి ఒడంబడికవల్ల రష్యాకుకలిగే నష్టంకూడా, అమెరికాకు కలిగేటంతపాటి, ఉంటుంది. రష్యన్ సైన్యాల భయం లేకపోతే, హంగరీ, పోలెండు, తూర్పు జర్మనీలలో కమ్యూనిష్టు ప్రభుత్వాలుపోయి, ఏదో విధమైన పార్లమెం

టరీ ప్రభుత్వాలు ఏర్పడవచ్చు. కాని. ఇలా జరగాలంటే, రష్యా సైన్యాల భయం తొలగి పోయిందనే నమ్మకం వారికి ఉండాలి. అందుచేత యూరప్‌లోని దేశాలలో నుండి పరాయిసైన్యాలు వెళ్ళిపోవడమేకాక, వాటిపై ఎవరూ దండెత్తి రారనే హామీకూడా ఉండాలి. 'రైన్' నది నుండి 'విశ్చులా' నదివరకూ గల ప్రాంతాన్ని తటస్థ ప్రాంతంగా చెయ్యవచ్చు. ఆ తటస్థరాజ్యాల కుండవలసిన సైన్యాలుకూడా చాలా తక్కువ పరిమితిలో ఉంచడం అవసరం. జర్మనీ మళ్ళా ఆయుధబలం సంపాదించుకుంటుం దేమోనని రష్యాకు చాలా భయంగా ఉంది.

గత రెండు ప్రపంచ యుద్ధాలలోనూ రష్యా అనుభవించిన బాధను బట్టి చూస్తే, ఈ భయం ఉండడం మనకు ఆశ్చర్యం కలిగించదు. కాని, తన దేశాన్ని తూర్పు పశ్చిమ భాగాలుగా చీల్చివేస్తూంటే, జర్మనీ చూస్తూ ఊరుకుంటుం దని కూడా అనుకోలేము. జర్మనీని పునరైక్యంచేస్తేనేకాని యూరప్‌లో సుస్థిరమైనశాంతి ఉండదు. అందువలన రష్యా వారికి భయం కలుగకుండా—జర్మనీ సైన్యాలపై, అందరూ అంగీకరించిన పరిమితులను విధించవలసి ఉంటుంది. యూరప్‌లో అమలు పరచవలసిన ఏ పరిష్కారానికయినా రెండు ప్రధాన లక్షణాలు ఉండాలి. ఒకటి: ఎట్టి పరిస్థితులలోనూ సంఘర్షణకు అవకాశం లేకుండా చెయ్యడం. రెండవది: ఏ దేశానికి యిష్టమయిన రాజకీయ ఆర్థిక వ్యవస్థలను ఆ దేశం అనుసరించుకునే స్వేచ్ఛఉండడం. సైన్యాల పరిమితికి సంబంధించిన విషయంలో తప్ప, స్వతంత్రరాజ్యాలకు సంబంధించిన

ఏ ఇతర ఆంతరంగిక వ్యవహారంలోనూ. ఎవరూ జోక్యం కల్గించుకోకూడదు. ఎవరయినా పార్లమెంటుకీ ప్రజాస్వామ్యాన్ని అనుసరించదలచుకుంటే అందుకు రష్యా అభ్యంతరం చెప్పకూడదు. ఎవరయినా కమ్యూనిజాన్ని అనుసరించదలచుకుంటే అందుకు అమెరికా అడ్డు చెప్పకూడదు.

అణ్వాయుధాలను నిషేధించడాన్ని గురించి ఒప్పందం జరిగిన తర్వాతనే అమెరికా తన సైన్యాలను పశ్చిమయూరప్ నుండీ ఉపసంహరిస్తుంది కాని, అంతకుముందు ఉపసంహరిస్తుందని నేననుకోను. అట్టి ఒప్పందం కుదరకపోతే అమెరికా యూరప్‌లో తనకున్న స్థావరాలను వదలుకోలేదు. అదీకాక యూరప్‌లో అమెరికా స్థావరాలు లేకపోతే. పశ్చిమయూరప్‌కు రక్షణ ఉండదు. ఈ కారణాల వల్లనే నిరాయుధీకరణ సమస్యను ఆక్రాంత ప్రాంతాల సమస్యనుండీ వేరుచేయడానికి వీలుండదు. ఉభయపక్షాలమధ్యా ఎట్టి పరిష్కారమయినా అన్ని సమస్యలనూ పరిష్కరించేదై ఉండాలి.

## 2. మధ్యప్రాచ్యం :

మధ్యప్రాచ్యంలో రెండు గడ్డు సమస్య లున్నాయి. ఒకటి పెట్రోలు; రెండు 'ఇజ్రేలు'. పశ్చిమ యూరప్ తన ఆర్థిక వ్యవస్థ అంతా మధ్యప్రాచ్యంనుండి వచ్చే పెట్రోలు మీద ఆధారపడేట్టు చేసుకుంది. ఇందువల్ల బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ఉచ్ఛదినాలలో ఏమీ ఇబ్బంది లేక పోయింది. పశ్చిమదేశాల పెట్టుబడిదారులు సైనికబలంతో మధ్యప్రాచ్య దేశాలను లొంగదీసుకుని, అక్కడి సంపద

నంతటినీ దోచుకోనడం ఆరోజుల్లో తేలికగా సాధ్యమయింది. కాని. ఆ కాలం గడచిపోయింది. ఇప్పుడు మధ్య ప్రాచ్యం రష్యా అండతో నిలబడి తన పెట్రోలుకు వెనుకటికన్నా పెద్ద ధరలు కావాలని పశ్చిమ రాజ్యాలను అడగగల బలం సంపాదించుకుంది. పశ్చిమ రాజ్యాలకు ఇది ఇష్టంలేకపోయినా, ఇంతమాత్రాన పరిస్థితి వినాశకరంగా పరిణమించవలసిన అవసరంలేదు. పశ్చిమ రాజ్యాలు అరబ్ జాతీయవాదులతో రాజీకివచ్చి. అరబ్ దేశాల అభివృద్ధికి అవసరమయిన ఆర్థిక సహాయాలుచేసి, వారు పెట్రోలును తమకు అమ్మేటట్లు చేసుకోవాలి. అరబ్ దేశాలలో తలయెత్తుతున్న జాతీయవాద భావాల యెడల రష్యా మిత్రత్వాన్ని ప్రకటించగా, పశ్చిమ రాజ్యాలు – ముఖ్యంగా బ్రిటన్, ఫ్రాన్స్‌లు ఆ భావాల యెడల శత్రుత్వాన్ని ప్రకటించడం చాలా పొరపాటు. ఇప్పటికైనా ఈ పొరపాటును సవరించుకోవాలి. పెట్రోలు అవసరం కదా అని, దుష్టశక్తుల్ని బలపరచడం మానుకోవాలి. పశ్చిమ రాజ్యాల దృక్పథంలో ప్రధానమైన మార్పులు రావాలి. రష్యాకూ పశ్చిమరాజ్యాలకూ మధ్య వైషమ్యం తగ్గాలంటే, మధ్య ప్రాచ్యంలోని దేశాలయెడల అనుసరణీయమైన విధానాలను గురించి ఉభయులకూ అంగీకారం కుదరాలి. దుష్ట ప్రభుత్వాలను బలపరచే అలవాటు అమెరికా మానుకోవాలి. కల్లోలాన్ని రెచ్చగొట్టే కోరికను రష్యా తగ్గించుకోవాలి.

పరిష్కారం కుదరాలంటే తేలవలసిన మరొక గడ్డు సమస్య—ఇజ్రేల్ సమస్య. అరబ్ రాజ్యాలకు 'ఇజ్రేల్'

యెడల ద్వేషం ఉండడం దోషమే కాని, అందుకు కారణాలు లేకపోలేదు. కేవలం అరబ్ దేశాలలోనే కాకుండా ఆసియా అంతటాకూడా 'ఇస్రేల్' ను పశ్చిమ సామ్రాజ్యవాదులు సృష్టించిన సమస్యగా భావిస్తున్నారు. యూదులు మొదట ఆసియానుంచి వెళ్ళినవారేనన్న సంగతి మరచిపోతున్నారు. శతాబ్దాలుగా వారిలో చాలమంది పూర్తిగా పశ్చిమదేశీయులయిపోయారన్న సంగతి ఒకటే గుర్తుపెట్టుకుంటున్నారు. పశ్చిమరాజ్యాలు సాహసంగా యూదులకొక రాజ్యాన్ని కల్పించిపెట్టి, దాన్ని రక్షిస్తామని బాహాటంగా ప్రకటించి యిప్పుడు దానిని వదిలెయ్యలేవు. అందుచేత చేయవలసిన పని ఒకటి ఉంది. ఇస్రేలు సరిహద్దులను శాశ్వతంగా స్థిర పరచి, ఆ సరిహద్దులను పరదేశాలుగాని, ఇస్రేలుగాని అతిక్రమించకుండా చూస్తామని అమెరికా రష్యాలు రెండూ ప్రకటించాలి. ఈ విషయంపై అగ్రరాజ్యాలకు అభిప్రాయ భేదం లేనప్పుడు అరబ్బులు, యూదులు, ఒకరికొకరు అలవాటు పడి పరస్పర ద్వేషం ప్రయోజన రహితమని గుర్తిస్తారు.

## 3. దూరప్రాచ్యం :

రష్యాలో లెనిన్ ప్రభుత్వం నిలదొక్కుకున్న తర్వాత పశ్చిమదేశాలు తిన్న పెద్దదెబ్బ—చైనాను కమ్యూనిస్టులు ఆక్రమించుకోవడం. చైనా దేశపు కమ్యూనిస్టులకు సైనిక సామ్రాజ్యవాద లక్షణాలు ఉన్నాయనడం నిర్వివాదం. చైనావారు కొరియా యుద్ధంలో జోక్యం కల్గించుకోవడం

ఎంత అధర్మమో, అంత దురదృష్టకరం. టిబెట్‌ను ఆక్రమించుకోనడంలో వారు చేసిన చర్య యిం కే పశ్చిమరాజ్యమయినా చేసిఉంటే, తీవ్రమయిన ఖండనకు గురికావలసి ఉండేది.

ప్రపంచంలో అన్ని దేశాలూ సర్వనాశనమయిపోయే సంక్షోభం వస్తే తప్ప, కమ్యూనిస్టులు చైనాను వదలుకుంటారని వివేకవంతు డెవడూ అనుకోడు. అమెరికాలోనూ, ఐక్యరాజ్య సమితిలోనూ కొందరు ఇంకా చియాంగ్-కై-షేకే చైనా ప్రతినిధి అని నమ్మినట్టు నటిస్తూ ఉండటం వివేకవంతులకు అర్హమయిన పని గాదు. ఎప్పటికయినా సరే పరిష్కారం కుదరాలంటే కమ్యూనిస్టు చైనాను గుర్తించడం అవసరం. చియాంగ్-కై-షేక్‌ను సమర్థించడం మానాలి. ఫార్మోజాకు సంబంధించినంతవరకు చియాంగ్-కై-షేక్ కమ్యూనిస్టు చైనాతో ఒడంబడిక చేసుకోవడం మంచిది. చియాంగ్-కై-షేక్ బ్రతికి ఉన్నంతవరకు ఫార్మోజాకు అతనిని అధిపతిగా ఉండనివ్వడానికీ, తదనంతరం అది చైనాలో కలిసిపోవడానికీ ఉభయులూ అంగీకరించాలి. బ్రిటన్‌కు సైప్రస్‌లాగానే, అమెరికాకు ఫార్మోజా, యుద్ధతంత్రరీత్యా, చాలా ప్రధానమయినది. అణు యుద్ధంకోసం సర్వసన్నద్ధంగా ఉండాలనుకుంటున్నంతకాలం అమెరికా దీనిని వదలలేదు. అణుయుద్ధప్రమాదాన్ని తప్పించుకో గలిగితే, క్లిష్టసమస్యలుగా పరిణమించిన ఈ రెండు దీవులనూ స్వేచ్ఛగా వదలివేయవచ్చు. కమ్యూనిస్టుచైనా షరతులకు ఇప్పుడు ఒప్పుకోవడం పశ్చిమరాజ్యాలవారికి అవమానకరమని కొంతమంది అంటున్నారు.

కాని, అట్టి అవమానమే కలిగితే, యింతవరకూ అనుసరించిన అవివేక మార్గానికి అది అర్హమైన శిక్షే అవుతుంది. అట్టి శిక్ష విచారకరమైనా, సర్వనాశనానికి మాత్రమే దారితీయ గల ప్రస్తుత విధానాన్నే పట్టుకొని వ్రేలాడడ మంత విచారకరం కాదు. రష్యా అమెరికాలతో సమానమయిన బలం సంపాదించగల సామర్థ్యం చైనాకు ఉంది. కొద్ది దశాబ్దులలోనే అది అంత ప్రబల రాజ్యమూ కావచ్చు. దురాక్రమణ తృష్ణ, సామ్రాజ్యవాద తత్వమూ గల రాజ్యంగా చైనా తయారయితే. ప్రపంచశాంతి సురక్షితంగా ఉండదు. చైనా అలా తయారయే ప్రమాదం ఉండకపోదా. అప్పుడు తూర్పునుంచి రాగల దండయాత్రను నిలుపరించి సమష్టిగా ఆత్మరక్షణ చేసుకోవలసిన అగత్యం అమెరికాకు, యూరప్ దేశాలకు (రష్యాకుకూడా) ఉంటుంది. నిజమైన ఆత్మరక్షణ ఆయుధాలవల్ల కలుగదు. వివేకవంతమయిన సహిష్ణుత వల్లనూ, మనఃపూర్వక శాంతి కాంక్షల వలననూ కలుగు తుంది. ఈ భావం మనకున్నదని చైనాకు ఇంతవరకూ ఋజువుకా లేదు. నల్లమందు యుద్ధంనాటినుంచీ వారికి మన యెడల ఉన్న భావాల్ని మార్చవలసిన సమయం ఆసన్నమయింది.

తొమ్మిది

# అంతర్జాతీయ ప్రభుత్వం

నాధికారంగా అంతిమ నిర్ణయాలు చేసి, వానిని అమలు పరచగల అంతర్జాతీయ ప్రభుత్వం నెలకొల్పడం—సుస్థిర ప్రపంచశాంతి ఏర్పడడానికి ప్రధానంగా అవసరమని ఈ సమస్యను పరిశీలించినవారు చాలామంది భావిస్తున్నారు. ప్రస్తుతానికి ఇది కేవలం విజ్ఞానదృష్ట్యా చర్చనీయ విషయం మాత్రమే. ప్రాక్పశ్చిమరాజ్యాల మధ్య వైరభావం ఇలాగే ఉన్నంతకాలం, ఏ పక్షమూ అంతర్జాతీయ ప్రభుత్వాన్ని మన్నించదు—తాను ఆ అంతర్జాతీయ ప్రభుత్వాన్నే లోంగదీసుకునే అవకాశం ఉంటే తప్ప! అసలు సమస్యనంతటినీ క్లుప్తంగా చెపితే యిది: నీమిత్రులూ, నీ శత్రువులూ కూడా జీవించడం నీకిష్టమా? లేక ఉభయులూ నాశనమయి పోవడం నీకిష్టమా? ఈ మాటల్లో చెపితే, తమ శత్రువులు నాశనం అవడం కన్నా తమ మిత్రులు జీవించడమే కావాలని చాలామంది కోరుకుంటారు. కాని, దీనిని వారు మనఃపూర్వకంగా కావాలంటే, అందుకై తమకు హితవుకాని చర్యలు కొన్ని చేసి తీరాలని చెపితే, ఆపనులు అవసరం లేదని వాదిస్తూ, ప్రపంచ వినాశకరమైన ప్రస్తుత విధానాన్నే అనుసరిస్తూంటారు. ఈ అధ్యాయంలో అంతర్జాతీయ ప్రభుత్వం క్రమంగా అధికారంలోకి రావడానికి, అట్టే బాధాకరంకాని మార్గాలుకొన్ని సూచిస్తాను. ఇంతకు పూర్వపు అధ్యాయా

లలో సూచించిన పరిష్కార మార్గాలు ఆచరణలోకి వచ్చిన తరువాతనే యీ సూచనలను అమలులో పెట్ట గలం.

మొట్టమొదట చేయవలసినపని – ఏడవ అధ్యాయం లో సూచించిన మధ్యవర్తి సంఘానికి సలహాలిచ్చే అధికారం ఉన్నదని గుర్తించడం. ఈ సంఘం ప్రాక్పశ్చిమ రాజ్యాల మధ్య వచ్చిన విభేదాలకు మాత్రమే వర్తిస్తుంది. మిగిలిన చిన్నవిభేదాలకు వేరే పరిష్కారమార్గాలు అవసర మవుతాయి.

నానాజాతి సమితినీ, ఐక్యరాజ్య సమితినీ నిర్మించిన వారు యుద్ధాన్ని నిరోధించగల అంతర్జాతీయ ప్రభుత్వానికి అవి బీజప్రాయము లవుతాయని ఉద్దేశించారు. రెండూ విఫలమైనాయి. అయినా, ఐక్యరాజ్యసమితిని సంస్కరించి యీ లక్ష్యం సాధించడానికి అనువుగా రూపొందించవచ్చు ననుకుంటాను. కాని ఇందుకు చాలా తీవ్రమయిన సంస్క రణలు అవసరమవుతాయి. అందులో కొన్ని ప్రస్తుత రాజ కీయరంగంలో ఆచరణ సాధ్యములు కావు కూడా.

కొద్ది సంవత్సరాలలోనే మనంచేయడానికి వీలున్న ఒక ముఖ్యమైన సంస్కరణ ఉన్నది. సభ్యత్వం కావా లన్న అన్ని రాజ్యాలను ఐక్యరాజ్యసమితిలో చేరనివ్వడం. ఈ విషయంలో కమ్యూనిస్టుచైనా ప్రధానసమస్య అవు తుందని అందరికీ తెలుసు. ప్రపంచంలోకల్లా చైనా ఎక్కువ జనాభాకల దేశం. బహుశః కొన్ని దశాబ్దులలోనే అది

అత్యంత శక్తిమంతం కూడా కావచ్చు. అంతర్జాతీయం గానూ, నిష్పక్షపాతంగానూ ఉండనుద్దేశించిన సంస్థలో ఇంత ప్రధానమైన దేశం లేకుండా ఏపనీ నెరవేరదు. ఐక్య రాజ్యసమితి విధించిన నియమాలకు కట్టుబడి ఉంటానని ఒప్పుకున్న ఏదేశాన్నయినా సరే, యిలా వెలివేయడం **అకారణమయిన పని.**

సమాఖ్య * వ్యవస్థ లన్నిటికీ వచ్చే చిక్కు ఒకటి ఉన్నది. సమాఖ్యలో కొందరు సభ్యులు బలవంతులు, ఎక్కువ జనాభా కలవారూ అయి ఉంటారు. ఇట్టి సభ్యుల మధ్య సమానత్వం ఉండాలనడం న్యాయంగా కన్పించదు. అమెరికా రాజ్యాంగ రచయితలకు ఈ చిక్కు రాగా, దానిని వారు ఒక రాజీ పరిష్కారంవలన తీర్మానించుకున్నారని మనమంతా ఎరుగుదుము. సెనేటులో అన్ని రాష్ట్రాలకు సమానత్వం ఇచ్చి, ప్రతినిధుల సభలో ఆయారాష్ట్రాల జనాభా ప్రాతిపదికనుబట్టి వాటికి సభ్యత్వం ఇచ్చారు. మనం సంస్కరించబోయే ఐక్యరాజ్య సమితిలోకూడా యిలాంటి పద్ధతి ఏదో అనుసరించాలి. అప్పుడు చిన్న రాజ్యాలకు తగని ప్రాముఖ్యం ఉండదు. ఐక్యరాజ్య సమితిలో ప్రస్తుతం అసెంబ్లీలో అన్ని రాజ్యాలకు సమానత్వం ఉండి, భద్రతా సంఘంలో కొన్ని అగ్రరాజ్యాలకు మాత్రం 'వీటో' అధికారం ఉంది. దీనిని చాలామంది విమర్శించారు. దీనికి నేను ఒక పరిష్కార మార్గాన్ని ప్రతిపాదిస్తాను. ఇందుకు చాలా అభ్యంతరాలు రావచ్చునని నాకు తెలుసు. ప్రపంచా

* Federal.

న్నంతటినీ కొన్ని ఉపసమాఖ్యలుగా విడదీసి వాటిని చేర్చి ప్రపంచసమాఖ్యను ఏర్పరచాలి. ఈ ఉపసమాఖ్యలను ఏర్పరచేటప్పుడు రెండు నియమాలను అనుసరించాలి. ఒకటి. ఈ ఉపసమాఖ్యలన్నింటిలో సమాన జనాభా ఉండాలి. అప్పుడు ప్రపంచ సమాఖ్య (అనగా సంస్కరింపబడిన ఐక్యరాజ్య సమితి)లో యీ ఉపసమాఖ్యలకు సమానత్వం ఉన్నా చిక్కేమీ ఉండదు. రెండు. వీలున్నంతవరకు, ఈ ఉపసమాఖ్యలలోని దేశాలకు, ప్రపంచ సమాఖ్యకోసం కల్పితమైన సంబంధాలకన్నా, సహజమైన ఆంతరంగిక బాంధవ్యాలు ఎక్కువగా ఉండాలి. ఈ ఉపసమాఖ్యలకు ఆంతరంగిక వ్యవహారాలలో స్వాతంత్ర్యం ఉంటుందనీ, వివిధ ఉపసమాఖ్యలమధ్య వచ్చే వివాదాలే ప్రపంచ సమాఖ్యలో చర్చకు వస్తాయనీ – అధికారికంగా ప్రకటించకపోయినా – అందరూ అంగీకరించాలి. అందువల్ల స్థానిక వ్యవహారాలలో అంతర్జాతీయ ప్రభుత్వం జోక్యం కల్పించుకొనే అవసరం చాలా తగ్గిపోతుంది.

1954 లో ఐక్యరాజ్యసమితి ఏర్పడినపుడు 'వీటో' అధికారాన్నివ్వడం ఆచరణదృష్ట్యా అవసరమయింది. అమెరికా రష్యాలు రెండూ ఈనియమానికి అంగీకరించాయి. ప్రాక్పశ్చిమరాజ్యాలు వారి ఉమ్మడి ప్రయోజనాలను ఇప్పటికన్నా ఎక్కువ స్పష్టంగా గ్రహించగలిగితేతప్ప యీ'వీటో' రద్దయే అవకాశంలేదు. కాని 'వీటో' ఉన్నంతకాలమూ ఐక్యరాజ్యసమితికి సాధారణంగా ప్రభుత్వాని కుండవలసిన ముఖ్యలక్షణాలలో ఒకటి లేకుండాపోతుంది. ప్రభుత్వవిధు

లను ఉల్లంఘించిన వారందరిచేత శాసించి, ఆవిధులు ఆచ రింపచేయడం ప్రభుత్వాని కుండవలసిన లక్షణం. దొంగ వాడెవడయినా దొంగతనం నేరమని శాసించే చట్టాలను 'వీటో' చేయడానికి వీలున్న రాజ్యాన్ని గురించి మనం ఏమనుకుంటాం ? ఇట్టి పద్ధతిలో నడచిన దేశం ఒకటి వెనక ఉండేది. అది పోలండ్. ఆరాజ్యంలో ఉన్న Liburum Veto అనే నియమంవల్ల ఆ దేశం పూర్తిగా శక్తిహీనమయిపోగా, పొరుగురాజ్యాలు దాన్ని ఆక్రమించుకున్నాయి. అయినప్ప టికీ ఐక్యరాజ్యసమితిని నిర్మించేటప్పుడు యీవిధానాన్నే అనుసరించారు. అప్పటికే ప్రాక్పశ్చిమ రాజ్యాలమధ్య నున్న పరస్పర విరుద్ధభావాల వలన మార్గం తప్పనిసరి అయింది. కాని ఎప్పటికయినా ప్రపంచయుద్ధాన్ని ఆపగల అంతర్జా తీయ ప్రభుత్వం నెలకొనాలంటే, అందులో 'వీటో'కి చోటు ఉండకూడదు. ఉంటే, అది ఏ వివాదాన్నీ పరిష్కరించ లేదు.

అన్ని సమాఖ్యప్రభుత్వాలలో మాదిరిగా ప్రపంచ సమాఖ్య విషయంలో కూడ, ఏ అధికారాలు సమాఖ్యకు చెందుతాయనే విషయమై స్థిరమయిన నిర్ణయంచేసే రాజ్యాంగం అవసరం. యుద్ధాన్ని వారించడానికి అవసర మయిన అధికారాలుమాత్రమే సమాఖ్యకు ఇవ్వాలని అంతా గ్రహించాలి. మత విషయంలోగాని, ఆర్థికవ్యవస్థ విషయంలో గాని, రాజకీయవిధానం విషయంలోగాని సమాఖ్య జోక్యం కలగచేసుకో గూడదు. కొన్ని జాతులు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, మరికొన్ని జాతులు ఏదో ఒకవిధమయిన నియంతృత్వాన్ని అనుసరించాలనుకుంటే – వాటికి అందుకు

సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలి. అలాగే కమ్యూనిజం కావా లనుకున్నా, కేపిటలిజమ్ కావాలనుకున్నా – అనుసరించ డానికి ప్రతిదేశానికీ స్వేచ్ఛ ఉండాలి.

తమ తమ దేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యానికి, తాము అవసరమనుకున్న పరిమితులు ఏర్పరచుకోడానికి కూడా అన్ని దేశాలకూ స్వేచ్ఛ ఉండాలి. సమాఖ్య ప్రభుత్వం సభ్యదేశాలలో, పత్రికా స్వాతంత్ర్యంగాని, మరి యేయితర స్వాతంత్ర్యంగాని ఉండాలని విధించకూడదు. ఇట్టి స్వాతం త్ర్యాల ప్రాముఖ్యాన్ని గుర్తించినప్పటికీ— నేను ఈ మాట చెపుతున్నాను. బయటి రాజ్యాలు జోక్యం కలిగించుకో డానికి యుద్ధాన్ని నిరోధించడం ఒకటే సమర్థనీయమయిన కారణంగా వుండాలి.

ఊహా స్వర్గంలోకి ఇప్పటికే చాలా ఎత్తు ఎగిరాము. కాని దీనిని మించిన ఊహాగానంలా కన్పించే యింకొక చర్య వున్నది. ప్రపంచ శాంతి స్థిరంగా ఉండాలంటే యిది కూడ అవసరమే. ప్రపంచంలోని ఏజాతి సైన్యాలనైనా, లేక ఏజాతుల కూటమియొక్క సైన్యాలనైనా ఓడించ గలంత బలవత్తమమైన అంతర్జాతీయ సైన్యం ఉండాలి. ఇది లేకపోతే అంతర్జాతీయ ప్రభుత్వపు ఆజ్ఞలు అమలు చేయ డానికి వీలుండక కెల్లాగ్ (Kellog) సంధి నిర్ణయాలలాగా అవి వట్టిమాటల మూటలవలె తయారవుతాయి. తనకు అవ సరమయిన సైన్యాన్ని సమకూర్చుకోడానికీ, అందుకు కావల సిన ధనాన్ని పన్నులద్వారా వసూలు చేసుకోడానికీ అంత

ర్జాతీయ ప్రభుత్వానికి స్వేచ్ఛ ఉండాలి. వివిధరాజ్యాల సైన్యాలను పరిమితం చేయడానికికూడా అంతర్జాతీయ ప్రభుత్వానికి చట్టబద్ధమయిన అధికారాలుండాలి.

ఇదంతా ఎంతఊహాగానంలాగా కన్పించినా, ఒక ప్పుడు, 'తుపాకిమందు' కనిపెట్టిన కొత్తరోజుల్లో 'వివిధదేశాలలో జరిగిన చరిత్రకూ, దీనికీ చాలా పోలికలున్నాయి. పశ్చిమ యూరప్‌లో, మధ్యయుగాలలో, శక్తిమంతులయిన భూస్వాములు కోటలు కట్టుకొని కేంద్రప్రభుత్వాలను ధిక్కరిస్తూ ఉండేవారు. శతఘ్ని దళాలు ఈ ప్రభువుల కోటలను బద్దలు కొట్టగలిగిన తరువాతనే, కేంద్ర ప్రభుత్వాలకు వీరిని అదుపులో పెట్టగల సామర్థ్యం వచ్చింది. మధ్యయుగాలలో తుపాకిమందు చేసినపని యిప్పుడు అణ్వాయుధాలు చెయ్యాలి. అంటే, అణ్వాయుధాలను నిజంగా ప్రయోగించాలని నా అభిప్రాయంకాదు. ప్రభుత్వాలు తమ దేశాలలోని నేరస్థులను అదుపులో పెట్టడానికి తుపాకిమందుకూడా తరచు ఉపయోగించవలసిన అవసరం ఉండదు. ఆ విధంగానే, ఏదేశ ప్రభుత్వానికి అణ్వాయుధాలు లేకుండా, ఒక్క అంతర్జాతీయ ప్రభుత్వానికి మాత్రమే వాటిని తయారుచేసే ఉపకరణాలుంటే, అప్పుడు వీటిని ఉపయోగించవలసిన అవసరం ఉండదు.

అంతర్జాతీయ సైన్యం సమర్థంగాను, నిరపాయకరంగాను ఉండాలంటే, అందుకు కొన్ని నియమాలను అనుసరించాలి. వివిధజాతీయ ప్రభుత్వాలు పంపించిన పెద్ద పెద్ద

దళాలను కలిపి అంతర్జాతీయ సైన్యాన్ని తయారు చేయ కూడదు. అలా తయారుచేస్తే, ఆయా దళాలకు వారి జాతీయ లక్షణాలు విభిన్నంగా ఉండి, వారి కిష్టంలేని నిర్ణయాలను వారిచేత అమలు చేయించేటప్పుడు వారిని విశ్వసించ డానికి వీలుండదు. అందుచేత ప్రతి దళంలోనూ, ప్రతి పటాలంలోనూ, ప్రతి జలాంతర్గామిలోనూ వివిధజాతుల సైనికులు కలిసి ఉండాలి. అందుచేత వారి జాతీయ ప్రయోజనాలకోసం ఎవరూ తిరగబడే ప్రమాదం ఉండదు. ప్రాక్పశ్చిమ దేశాలమధ్య భేదభావం ఇలాగే ఉన్నంతకాలమూ సర్వ సేనాధిపత్యం తటస్థరాజ్యాలవారికి యివ్వడం వాంఛనీయం. అంతర్జాతీయ సైన్యంవిషయం వచ్చేసరికల్లా చాలా మంది చాలా అభ్యంతరాలు చెబుతారు. ఈ అభ్యంతరాలు పౌర పోలీసు దళాలకుకూడ నిజానికి వర్తింపజేయ వచ్చు. అట్టి సైన్యం పెద్ద విప్లవంచేసి ప్రపంచ పౌరప్రభుత్వాల నెత్తిమీద కూచొని క్రూర పరిపాలన చేస్తుందని వీరి వాదన. సిద్ధాంతరీత్యా జాతీయ సైన్యాల విషయంలో యీ మాట నిజమే. అప్పుడప్పుడు అస్థిర ప్రభుత్వాలున్న దేశాలలో యిట్టి సంఘటన సంభవిస్తుందికూడా. కాని, రష్యాలోనూ అమెరికాలోనూ, చివరకు నాజీ జర్మనీలో కూడా పౌర ప్రభుత్వాలు వాటి ఆధిక్యాన్ని నిలబెట్టుకో డానికి పటిష్ఠమయిన సంప్రదాయాలను ఏర్పరచాయి. అంతర్జాతీయ రంగంలోకూడా యీ పద్ధతులు ఇంత సమర్థంగానే ఉంటాయా అని సందేహించడానికి నాకేమీ ఆస్కారం కన్పించడంలేదు.

వివిధజాతీయ ప్రభుత్వాల బాంధవ్యాలను అంతర్జాతీయ ప్రభుత్వం అదుపులో పెట్టడం ప్రపంచ శాంతికి అత్యవసరం. ఈ ఏర్పాటు తాత్కాలికమైనది కాకూడదు. ప్రపంచం ఇలా కొంతకాలం నిరంతర సన్నద్ధ విధానాన్నే అనుసరించి, అదృష్టం ఉన్నంతకాలం ప్రమాదస్థితిలో పడకుండా ఉండవచ్చును. కాని, అదృష్టం ఎల్లకాలమూ కలిసి వస్తుందనుకోడానికి వీలులేదు. కొంచెం ముందుగానో, వెనుకనో ప్రస్తుత విధానాలవలన ప్రమాదం తప్పదు. మధ్యయుగాలలో రాజులను మన్నించడం భూస్వాములకు ఎంత కష్టమయినదో, అంతర్జాతీయ ప్రభుత్వాన్ని మన్నించడం ఇప్పుడు జాతీయ ప్రభుత్వాలకు అంత కష్టమయిన పనిగా ఉంటుంది. అంతర్జాతీయ ప్రభుత్వం ఆచరణ సాధ్యం అని యిప్పటి కింకా అనిపించకపోయినా ప్రపంచాన్ని అణుయుద్ధ ప్రమాదాన్నుండి రక్షించాలనుకునే వారంతా దానిని తమ చరమలక్ష్యంగా భావించాలి.

నేను పైన చెప్పిన చర్యలు కొన్ని 'ఊహాగానా' లని అన్నాను. ప్రస్తుతపు రాజకీయ వాతావరణంలో వీటిని అలా భావించక తప్పదు. శక్తిమంతమయిన అంతర్జాతీయ సైన్యం ఏర్పరచడానికి ముందు వైరిపక్షాలమధ్య స్పర్ధలు తగ్గించడానికీ, పరస్పర స్నేహభావం ఏర్పరచడానికీ పట్టుదలతో దీర్ఘకృషి చేయవలసి ఉంటుంది. కాని అట్టి సైన్యాన్ని నే ననుకున్నదానికన్న తక్కువ వ్యవధిలోనే ఏర్పాటు చేయవచ్చునని కొందరి అభిప్రాయం. బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీలో ఈ అభిప్రాయం ప్రబలంగా ఉంది. పది

మంది కన్సర్వేటివ్ పార్లమెంటు సభ్యులు "ప్రపంచ భద్రతా సంఘం" * అనే పేరున ఒక కరపత్రం ప్రచురించారు. ప్రపంచ సమస్యలు పరిష్కరించబడడానికి ప్రపంచ ప్రభుత్వం ఒకటే శరణ్యమనే భావాన్ని యీ కరపత్ర రచయితలు ప్రకటిస్తూ అందుకు ప్రస్తుత బ్రిటిష్ ప్రధాని ప్రకటనలనూ, రక్షణ మంత్రి "డంకన్ సాండేస్" చేసిన ప్రకటనలను ఆధారంగా తీసుకున్నారు. ఈ రచయితలు ఆచరణ సాధ్య మనుకున్న దంతా నిజమయితే బాగుండుననే నా ఆశ. కాని, ప్రధానంగా అమెరికా రష్యాలు రెండూ ఇందుకు చాలా ప్రబల మైన అడ్డంకులు కల్పిస్తాయని నా భయం. ప్రపంచం హేతువాదానికీ, సంపూర్ణ వినాశనానికీ మధ్య చిక్కుకొని ఉంది. సంపూర్ణ వినాశనం జరుగుతుందని వాదించేవారు మానవ వ్యవహారాలలో హేతువాదానికి ఎప్పుడూ అత్యల్ప ప్రమేయమే ఉన్నదనే విషాదకరమయిన సత్యాన్ని చెప్తున్నారు. పరిస్థితులు ఇలా ఉన్నంతవరకూ భవిష్యత్తును గురించి ఏ జోస్యం చెప్పబోయినా, అందులో ఆశ సగం, భయం సగం ఉండక తప్పదు.

---

* *World Security Authority* – By Ten Conservative Members of Parliament. Conservative Political Centre, London, 1958.

# మన దృక్పథంలో రావలసిన మార్పులు

వెనుకటి అధ్యాయంలో నేను సూచించిన విధానాలను – ప్రస్తుత పరిస్థితులలో – ప్రాక్ పశ్చిమరాజ్యాలవారుభయులూ తీవ్రంగా ప్రతిఘటిస్తారు. కాని, మానవజాతి నాశనం కాకుండా రక్షించడానికి అసాధ్యం కాని కనీసవిధులు మాత్రం నేను సూచించాను. విద్వేషాలు కరుడుకట్టుకోని పోవడంవల్ల, స్పష్టంగా ఆలోచించే శక్తి సన్నగిల్లి అంతర్జాతీయ రాజకీయాలలో మన వివేకం సక్రమంగా వినియోగపడడానికి ఆటంకం కలుగుతున్నది. ఈ అధ్యాయంలో అట్టి ఆటంకాలలో ముఖ్యమైన వాటిని వివరించి, వాటిని అతిగమించడానికి మార్గాలను సూచిస్తాను.

## భావోన్మాదము

తనకు వ్యతిరేకమయిన సిద్ధాంతానికి విజయం లభించడంకంటె, మానవజాతి మారణమై పోవడమైనా మంచిదే నని భావించేవారు పశ్చిమరాజ్యాలలోను, బహుశః, తూర్పు రాజ్యాలలో కూడ, చాలామంది ఉన్నారు. "రష్యా ప్రభుత్వం (అవతలివారి దృష్టిలో అమెరికాప్రభుత్వం) ప్రపంచాన్నంతటినీ ఏకచ్ఛత్రంగా పరిపాలిస్తుంటే, అది ప్రజలను పెట్టే బాధలు జీవించడం కన్నా మరణించడమే మేలనిపించేటంత ఘోరంగా ఉంటాయి. అందుచేత అప్పటికి మానవ

జాతినే లేకుండాచేస్తే, రాబోయే తరాలవారికి మనంఎంతో ఉపకారం చేసినట్లవుతుంది.'' అని వీరివాదం. కాబట్టి శత్రువుల సిద్ధాంతాలను అనుసరించేవారికి విజయం లభించకుండా చేయడానికి అణుయుద్ధం తప్ప గత్యంతరం లేకపోతే – అట్టి యుద్ధంలో మానవజాతి సర్వనాశనం అయే ప్రమాదం ఉన్నా సరే—వాంఛనీయమేనని వీరంటారు. ఈ దృక్పథం కలగడానికి భయంకరమైన ఉన్మాదం కారణమని చెప్పక తప్పదు. పైగా ఈ దృక్పథాన్ని అనుసరించే పశ్చిమపక్షం వారు తాము ప్రజాస్వామ్యాన్ని పరిరక్షిస్తున్నట్లు భావిస్తున్నారు. ప్రపంచం మొత్తంమీద ప్రజాభిప్రాయంకోసం వోట్లువెయ్యమంటే, తమవాదం చిత్తుగా ఓడిపోతుందని తెలిసికూడా, ఇది ప్రజాస్వామ్య పరిరక్షణకోసమని అనుకోవడం చాలా విచిత్రం! ప్రజాస్వామ్యాన్నేకాక, స్వేచ్ఛని కూడ పరిరక్షిస్తున్నామని ఈ ఉన్మాదుల నమ్మకం. ఉదాహరణకి, ఒక భారతీయునితో మాట్లాడేటప్పుడు వీరు తమ వాదాన్ని ఎలా నచ్చచెబుతారో! శతవిధాలా భారతీయుడేమి చెబుతాడంటే – ''రష్యా సిద్ధాంతంలోనూ పశ్చిమ దేశాల సిద్ధాంతంలోనూ కూడా కొంత మంచి ఉన్నది; కొంత చెడ్డ ఉన్నది. కాని, అత్యధిక ప్రజానీకపు నిత్యజీవితంలో అధికభాగానికి ఈరెండు సిద్ధాంతాలూ అడ్డురావు. అందుచేత, మానవజాతి సమూల వినాశనంకంటె, ఇందులో ఏసిద్ధాంతమూ దుర్భరమయినది కాదు'' – అని. అప్పుడు మన భావోన్మాది – అలాంటి దృక్పథం నీచమనీ, మరణదండనార్హమైనంత నీచాతి నీచమనీ ఆభారతీయునితో చెప్ప

వలసి ఉంటుంది. కాని, ఆదండనను ప్రజాస్వామ్యంపేరున గాని, స్వేచ్ఛపేరునగాని అనుభవించ వలసిందని ఆభార తీయుణ్ణి ఒప్పించగలడని మాత్రం నేననుకోను.

ఈ వాదాన్ని యింకా వివరంగా పరిశీలిద్దాం. రాజ కీయంగా అభివృద్ధిపొందిన దేశాలలోకూడ, అత్యనేక సంఖ్యా కులు నిత్యజీవితంలో ఎక్కువసేపు రాజకీయాలతో ఏమీా సంబంధంలేని పనులే చేస్తుంటారు. తిండి, నిద్ర, ప్రేమ, పెళ్ళాం బిడ్డలు, వాళ్ళ ఉద్యోగవృత్తులలో జయాపజయాలు, వంట్లో ఆరోగ్యాన్ని బట్టి వచ్చే సుఖము, బాధ, యిలాంటి విషయాలే వాళ్లకి ఎక్కువ ప్రధానమైనవి. సామాన్యపౌరు డెవరిదగ్గర కయినా నీవుపోయి "ఏమండీ! యిప్పుడు మనకు ఉన్న ఆర్థిక రాజకీయ వ్యవస్థ మారిపోయి, యింకొకటివస్తే మీరు అట్టి వ్యవస్థకు తల ఒగ్గి జీవిస్తారా? లేక అంతకన్నా, మానవజాతి అంతా ఘోర మరణాన్ని వరించడమే మేలని భావిస్తారా?" అని గంభీరంగా, ఒక ప్రధాన సమస్యలాగ అడిగితే, నువ్వు పిచ్చివాడవని ఆయన అనుకుంటాడు. ఆవిధంగా అనుకోవడంలో తప్పేమీా లేదుకూడా. వివాద విద్వేషాలవల్ల మానవజీవితపు పరమార్థాన్ని పూర్తిగా మరచిపోయినవాడు మాత్రమే ఈప్రశ్నకి అందరు వివేక వంతులూ చెప్పవలసిన సమాధానాన్ని చెప్పడానికి సంశ యిస్తాడు. కమ్యూనిజాన్ని గాని, కేపిటలిజాన్నిగాని ప్రతి ఘటించాలనే ఉద్యమంలో ఉన్నవారు జీవితంలో ఇంక అంత కన్నా ఉత్కృష్టమయినవి ఏవీ లేవనే నమ్మకంలో ఉన్నాడు

లై పోయే ప్రమాదం ఉంది. పిచ్చివాదాలలో పడి అట్టివాడు నిత్యజీవితంలోని సుఖదుఃఖాలనే గుర్తించలేకపోతాడు.

మనకు నచ్చని సిద్ధాంతం విజయం పొందడంకన్నా మానవజాతి నాశనం అయిపోవడమే వాంఛనీయం – అనే ముందు, మనం విచారించవలసిన విషయాలు ఇంకా కొన్ని ఉన్నాయి. మానవ చరిత్రలో కర్కోటక ప్రభుత్వాలూ, క్రూర రాజకీయ వ్యవస్థలూ చాలా ఉండేవి. ఉదాహరణకు చెంఘిజ్ ఖాన్ అట్టి కర్కోటకులలో ఒకడు. ఇప్పుడు వీరకమ్యూనిష్టువ్యతిరేకులు, స్టాలిన్ ఎంత కర్కోటకుడను కుంటున్నారో, చెంఘిజ్ ఖాన్ అంత కర్కోటకంగానూ ఉండేవాడు. కాని, అతని క్రూరపాలన శాశ్వతంగా నిలిచి పోలేదు. అతని క్రౌర్యానికి లొంగిపోవడానికి బదులు, అవసర మయితే మానవజాతినే నాశనం చెయ్యడానికి కావలసిన శక్తి ఆనాడు అతని శత్రువులకు ఉండి ఉంటే, వారు ఆశక్తిని ఉపయోగించలేదే అని ఇప్పుడు విచారించేవారెవ్వరూ లేరు.

రష్యాపరిపాలనకాని, అమెరికా పరిపాలనకాని, ఒక్క క్షణంపాటు ప్రపంచమంతటా ఏర్పడినా, యింక అది శాశ్వతంగా పాతుకుపోతుందని అనుకునే వారంతా చరిత్రజ్ఞాన శూన్యులనీ, అనవసర భయాలకు తేలికగా లొంగిపోయే వారనీ అనక తప్పదు.

ఇప్పుడు కమ్యూనిజము, కాపిటలిజము నేటి ఉన్మాదులకు ఎంత ప్రధాన సమస్యలుగా కనిపిస్తున్నాయో, అంత ప్రధానంగానూ కనిపించిన ఎన్నో తీవ్ర సమస్యలు గత

కాలంలో చాలా ఉద్భవించాయి. కాలక్రమాన అవి ఏవీ కూడా సమకాలికు లనుకున్నంత తీవ్రమైనవి కావని తేలి పోయింది. టూర్సు యుద్ధంలో (Battle of Tours) మహమ్మదీయులు గెలిచి ఉంటే ఏమైఉండేదో వర్ణిస్తూ గిబ్బన్ వ్రాసిన ప్రసిద్ధవాక్యాలు కొన్ని ఉన్నాయి. ఈ రోజులలో సెనేటర్ మెక్‌కార్తీకిగాని, స్టాలిన్‌కిగాని నేటి సమస్య ఎంత ప్రధానమైనదో, ఆరోజులలో క్రైస్తవులకు ఆసమస్య అంత ప్రధానమైనది. కాని, అప్పుడు క్రైస్తవులకు బదులు మహమ్మదీయులు గెలిచిఉంటే, ఇప్పటి ప్రపంచం ఈ మాదిరిగా ఉండకపోయేదా ? అని నా సంశయం. మనుష్య ప్రాణులున్నంతకాలం, కొంత మంచి, కొంత చెడు, చేస్తూనే ఉంటారు. అనవసరంగా బాధలు పెట్టే ప్రభుత్వాలూ ఉంటాయి; ప్రజాక్షేమంకోసం పాటుపడే ప్రభుత్వాలూ ఉంటాయి. కాని, అసలు మనుష్యులే లేకపోతే మానవ జాతి వేలాది ఏళ్ళుగా నిర్మించుకొన్న ఈ మంచి చెడ్డల సౌధం మొత్తం కూలిపోతుంది. ఈ ప్రభుత్వ వ్యవస్థలో కాని, ఆ ప్రభుత్వవ్యవస్థలోకాని, అసలు మంచి ఏమీ జరగదనే వాళ్ళ నైరాశ్యం నాకు దురవగాహంగా ఉంది.

మత యుద్ధాలు నిష్ఫలమైనవని అనుభవంలో తెలియడం వల్ల క్రమంగా మతోన్మాదం అంతరించి పోయింది. కాతలిక్కులు, ప్రొటస్టెంటులు, మహమ్మదీయులు ఒకచోట కలసి మనడం అసాధ్యమనుకునేవారు, ఇప్పుడు ఒకరి నొకరు మన్నించుకుంటూ బ్రతికగలుగుతున్నారు. కాని, 18, 19 శతాబ్దులలో మానవజాతి నేర్చుకున్న ఈ సహన భావాన్ని

యిప్పుడు వచ్చిన క్రొత్తవివాదాలవల్ల కొందరు మరచి పోతున్నారు. లోకె * మత సహనాన్ని గురించి వ్రాసినప్పుడు అతని వాదానికి అప్పుడు చాలమంది కోపగించుకున్నారు. ఆవాదాన్నే ఇప్పటి వివాదాలకు వర్తింపజేసినా, కోపావేశ పరులయేవారు చాలమంది ఉన్నారు. అతని వాదనను అందరూ ఒప్పుకోడానికీ, ఆనాటి వివాదాల స్వభావానికీ ఏమీ సంబంధం లేదు. సహనం చూపించాలని లోకె చేసిన వాదం యిప్పటి వివాదాలకు కూడా వర్తిస్తుంది. అలాగే, సహనం చూపించరాదనేవారు నేడు చేసే వాదనలుకూడ ఆనాటి లయోలా, కాల్విన్ మొదలైనవారు చేసిన వాదనల లాగే ఉంటాయి. అప్పుడు సహన భావం ఏకారణాన ఏర్పడిందో, ఈనాడు అందరూ మరచిపోతున్నారు. మన కష్టాలు గడచి గట్టెక్కాలంటే ఎప్పటికైనా ఆ కారణాలను మనం జ్ఞాపకం చేసుకోవలసిందే. అన్నిటికన్నా ముఖ్యవిష యం–మానవులెవరూ దోషరహితులుకారు. మనమూకాము. విస్తృతమైన క్రౌర్యాన్ని సమర్థించుకోడానికి తగినంత నిర్దుష్ట మైన సిద్ధాంతం ఏదీ లేదు.

## జాతీయవాదం

అంతర్జాతీయ ప్రభుత్వాన్ని నెలకొల్పాలనే ప్రయ త్నాల కన్నిటికీ కొన్ని విచ్ఛిన్నకర శక్తులు అసాధ్యమైన గడ్డు సమస్యలను తెచ్చిపెడతాయి. ప్రస్తుతం ప్రపంచ ఐకమత్యానికి కమ్యూనిజం, కేపిటలిజంల మధ్య నున్న వైర

* Locke : బ్రిటిష్ తత్త్వవేత్త.

భావం పెద్ద అవరోధంగా ఉంది. దీనికితోడు జాతీయవాదం ఇంకొక అవరోధం. కమ్యూనిజమూ, కేపిటలిజమూ పరస్పర సహనంతో మనగలిగినప్పటికీ, జాతీయవాదం మాత్రం యింకా అవరోధంగానే ఉంటుంది. తమ జాతి గొప్పతనం యెడల విశ్వాసమూ, తత్ఫలితంగా ఏర్పడిన కొన్ని నైతిక భావనలూ కలిపితే జాతీయవాదం అవుతుంది.

జాతీయవాదంలోని దుర్లక్షణాలనుమాత్రమే యిక్కడ ప్రిధానంగా వివరిస్తాను. కాని, అందులో మంచి లక్షణాలు కూడా ఉన్నాయని గట్టిగా చెబుతున్నాను. ప్రపంచంలో ప్రజలందరూ అన్ని విధాలా ఒక్కలాగే ఉండడం బాగుండదు. సాంస్కృతికంగా వివిధజాతుల మధ్యనున్న భిన్నత్వం కళకి, సాహిత్యానికి ప్రోత్సాహాన్ని కలిగిస్తుంది. జాతీయవాదం సాయుధ సంఘర్షణకి దారితీసినప్పుడే ప్రమాదకరంగా పరిణమిస్తుంది. ప్రితిజాతికీ, యితరజాతులతో సాయుధవైరం విషయంలో తప్ప, మిగిలిన అన్ని విషయాలలో స్వాతంత్ర్యం ఉండడం వాంఛనీయమే. అంతర్జాతీయ ప్రభుత్వం నెలకొల్పబడితే, అది ప్రపంచ శాంతి రక్షణకు అవసరమయిన విషయాల మేరకుమాత్రమే వివిధరాజ్యాల అధికారాలలో జోక్యం కలిగించుకోవాలి. అంతకుమించి కలిగించుకుంటే అది క్రౌర్యంగా పరిణమిస్తుంది.

కాని, ఇప్పుడు మన దృష్టిని జాతీయవాదంలోని ప్రమాదకర లక్షణాలవైపు మరల్చుదాం. కేపిటలిజం, కమ్యూనిజంల లాగ జాతీయవాదం ప్రపంచ వ్యాప్తమైన

ఒక విధానం కాదు. తమజాతి గొప్పదనే విశ్వాసమూ, ఇతర జాతులేమైపోతున్నా తమజాతి స్వార్థంకోసం ఏమైనా చేయు డానికి తమకు హక్కు కలదనే నమ్మకమూ జాతీయవాదంలో ప్రధానలక్షణాలు. 18 వ శతాబ్దంలో "బ్రిటిష్‌వారు ఎన్నటికీ బానిసలుకారు" అనే నినాదాన్ని ప్రారంభించి, వీలున్నంత మంది యితరజాతులవారిని బ్రిటిషువారు తమకు బానిసలుగా చేసుకున్నారు.

ఆతరువాత కొద్దికాలానికే ఫ్రెంచివారు "అపవిత్ర రక్తాన్ని మాపొలాలకు నీళ్లుగా వాడతాం" అనే నినాదాన్ని మొదలుపెట్టారు. అపవిత్రరక్తం అంటే ఫ్రెంచివారి దృష్టిలో ఆస్ట్రియనుల రక్తం. Deutschland uber alles అనే నినాదానికి అర్థం జర్మనీ ప్రపంచాన్ని పరిపాలించాలని కాదనీ, జర్మన్ జాతీయుడు జర్మనీ ప్రయోజనాలను తప్ప వేరేమీ ఆలోచించకూడదని దాని సరియైన అర్థమనీ వివరిస్తూ ఈ మధ్యనే ఒక జర్మన్ పౌరుడు నాకొక లేఖవ్రాశాడు. ఇంకా బోలెడు ఉదాహరణలు చూపించవచ్చును. కాని, ఈ విషయం సులభంగా బోధపడేదే కాబట్టి, యింతకు మించిన వివరణ అనవసరం.

ఎవరిజాతిగొప్పను వాళ్ళు పొగడుకోడం ఒక సుగుణంగా భావించబడుతూండడం చూస్తే నాకు చాలా తమాషాగా కనిపిస్తుంది. ఎవరైనా ఒక వ్యక్తి "నేను మిగతా అందరికన్నా నైతికంగానూ, మేధాశక్తిలోనూ ఉన్నతుణ్ణి. అందుచేత నాకు నా స్వార్థంతప్ప మిగిలినవాటిని లక్ష్యపెట్టక

పోవడానికి హక్కు ఉంది" అని ప్రకటిస్తే మనం ఏమను కుంటాం? ఈ విధంగా అనుకునేవాళ్ళు కొల్లలుగా ఉన్నారు. అయినా అట్టివారు లోపల అనుకొనే సంగతిని మరీ బహిరంగంగా ప్రకటించినా, ఆడంబరంగా చెప్పుకున్నా వారిని మనం గౌరవంగా చూడం. కాని, అలాంటి వ్యక్తులు ఒక దేశంనిండా చేరి తమను గురించి ఉమ్మడిగా అట్టి ప్రకట నలు చేసుకోవడం మొదలుపెడితే వాళ్లు తేజోవంతులనీ, ఉదాత్తులనీ, శక్త్యుత్సాహ సమన్వితులనీ పేరు వస్తుంది. ఒకరి శిలాప్రతిమలను మరొకరు ప్రతిష్ఠించుకొని, జాతీయ ఆత్మవంచనను అతి సాహసంతో ప్రతిపాదించిన నాయకులను పొగడమని బడిపిల్లలకు నేర్పుతారు.

జాతీయ తత్త్వానికి మన మెంత అలవాటు పడిపోయా మంటే—మానవ ప్రకృతిలో అది ఒక సహజ భాగంలా మనకు అనిపిస్తున్నది. కాని, చరిత్ర ఈ అభిప్రాయాన్ని బలపరచదు. యూదులు మినహా జాతీయవాద ప్రేరితు లైనవారు ప్రాచీన కాలంలో ఎవ్వరూ కనిపించరు. మధ్య యుగాలలో మతాధికారులు కాతలిక్ మతాన్ని అనుస రిస్తున్న దేశా లన్నిటిలోనూ సంచరించేవారు. వాళ్ళకు తమ మతాన్ని అనుసరించేవారియెడల పక్షపాతం ఉండేది కాని, జాతీయ భేదభావం ఉండేది కాదు. నవీనకాలపు జాతీయ తత్త్వం, విదేశీ సామ్రాజ్య వాదంతో సంఘర్షణ కోసం ఏర్పడ్డది. జోన్ ఆఫ్ ఆర్క్ ఫ్రాన్సులో ఇంగ్లీషు వారిని ఎదుర్కోడానికి సమష్టి ప్రతిఘటన చేసిన రోజులలో ఈ జాతీయ తత్త్వం ఆరంభమైనదని చెప్పవచ్చు. "స్పానిష్

ఆర్మడా''ను ప్రతిఘటించవలసి వచ్చినప్పుడు ఆంగ్లేయ జాతీయవాదం ఆరంభమై, షేక్స్పియర్ మహాకవి కవితావాణిలో ప్రస్ఫుటమైన, శాశ్వతమైన ప్రకటన పొందింది. జర్మన్, రష్యన్ జాతీయ వాదాలు నెపోలియన్‌ను ఎదుర్కొనవలసిన అవసరంవలన ఉద్భవించాయి. అమెరికా జాతీయవాదం ఇంగ్లీషువారితో యుద్ధం చేయవలసిన అవసరంకొద్దీ రూపొందింది. దురదృష్టవశాత్తు మానవుల మనస్సులలో సహజమైన శక్తి యేదో ఉండి, ఈ జాతీయ వాదానికి కొంత అభివృద్ధి కలిగించింది. పరజాతి ప్రాబల్యాన్ని ప్రతిఘటించవలసిన తరుణంలో స్వాతంత్ర్య సైనికులు తమ గుణాలను గర్వంగా, అతిశయంగా చెప్పుకోవడం, పరదేశపు పాలకుల లోపాలను ఎక్కువచేయడం సహజం. స్వాతంత్ర్య సంపాదనానంతరంకూడా ఇట్టి నమ్మకాలు మిగిలి, పరదేశాలపై ప్రాబల్యం సంపాదించడానికి ప్రోద్బల కారణాలవుతాయి.

పదిమందీ కలిసి గొప్పవారమని చెప్పుకోవడం ప్రజల సహజ ప్రవృత్తికి చాలా చక్కగా నప్పుతుంది. తమజాతి గొప్పతనంకంటె విభిన్నమైన ఉమ్మడి గొప్పతనంగల ప్రబలమైన కూటములు ఉంటేతప్ప. ఆ ప్రవృత్తిని ఎదిరించి నిలబడడం సాధ్యంకాదు. ఫ్రెంచివారిని సైతానుకన్నా తీవ్రంగా ద్వేషించమని ఫ్రెంచి విప్లవానికి ముందురోజులలో నెల్సన్ తన నావికులకు ఉద్బోధించాడు. అతని బోధనలు పాటించడంలో ఆ యువకులకు ఏమీ కష్టం లేకపోయింది. అందుచేత యుద్ధం జరుగుతున్న ఇరవైరెండు సంవత్సరాల పాటూ ఆబోధనలను వారు అక్షరాలా అనుసరించారు.

ఇంతవరకూ ఎన్ని యుద్ధాలు జరిగినా, మానవజాతి ఇంకా మిగిలి ఉంది. కాని, రాబోయే యుద్ధాలను గడచి గట్టెక్కుతుందని నమ్మకం కనిపించడంలేదు. ఆ కారణం చేత, వైర భావాన్ని ప్రేరేపించే విశ్వాసాలను తగ్గించడం మన విధి. ఇది తేలికగా సాధ్యం కాదు గాని, ప్రపంచశాంతి స్థిరపడాలన్నా, అంతర్జాతీయ ప్రభుత్వానికి సర్వజనామోదం కావాలన్నా, ఈపని తప్పనిసరిగా చెయ్యాలి. మానవులను విద్యావంతులుగా చేయడం వలననే దీనిని సాధించగలం. పెద్ద ప్రభుత్వాలు ప్రపంచ శాంతికోసం నిజంగా తహ తహ పడుతుంటే, ఈ విషయంలో చేయవలసిన పని ఏమిటో ఇప్పుడు చర్చిద్దాము.

## విద్య

రాజకీయ ప్రయోజనాలు సాధించడానికి యుద్ధం ఉపాయం కాదని అగ్రరాజ్యాలు అంగీకరించిన తరువాత చేయవలసిన మార్పులలో మొదటిది– విద్యావిషయకమైనది. చాలా దేశాలలో విద్యావిధానం రాజ్యపుచేతులలో ఉండబట్టి ఆ రాజ్యపు ప్రయోజనాలకు అనువైనదని భావింపబడే దృక్పథాన్ని ప్రజలకు కలిగించే పద్ధతిలోనే విద్య నేర్పబడుతున్నది. ఒక దేశానికి శ్రేయస్కరమైనదే మరొక దేశానికికూడా శ్రేయస్కరం కావచ్చుననే విషయాన్ని ఇంతవరకూ ఎవ్వరూ గుర్తించలేదు.

నిజానికి, పూర్వం ఎప్పుడూ యిట్టి పరిస్థితి సంభవించలేదు. నవీనశాస్త్రపురోగమనం వల్ల, మరీముఖ్యంగా అణ్వా

యుద్ధాలు కనిపెట్టడంవల్ల వివిధరాజ్యాలమధ్య స్పర్థలు నిష్ప్రయోజకమయి, ఇంతవరకూ ప్రపంచ చరిత్రలో ఎన్నడూ ఏర్పడనంత గాఢంగా అన్నిరాజ్యాల శ్రేయస్సులకూ ఐకమత్యం సిద్ధించింది. అందువల్ల ఏ దేశమూ మిగతా దేశాలకన్నా గొప్పదని చెప్పుకోవడంగాని, ఆ గొప్పదనం యుద్ధంవల్ల ఋజువవుతుందని బడిపిల్లలకు పాఠాలు చెప్పడం కాని యిప్పుడు లాభకరం కాదు. సైనిక ప్రాభవం అన్నిటి కన్నా గొప్పదని పూర్వంలాగ చెప్పుకోవడం కూడా ఇప్పుడు మంచిది కాదు.

ముఖ్యంగా చరిత్రపాఠాలు చెప్పేపద్ధతిలో మార్పులు రావాలి. ఈ మార్పు చిన్న పిల్లలకు పాఠాలుచెప్పే పద్ధతిలోనేకాక, ఉన్నతవిద్యలో కూడా రావాలి. మానవజాతి చరిత్ర నంతటినీ పరిశీలించానని ప్రకటించుకొన్న హెగెల్ అత్యంత ప్రతిభావంతులయిన వ్యక్తులుగా అలెగ్జాండర్, సీజర్, నెపోలియన్‌ల పేర్లను పేర్కొన్నాడు. జర్మనీలో హెగెల్ అనుయాయులు మరింత జాతీయ తత్త్వాన్ని ప్రకటించి, జర్మన్ వీరులే వీరులన్నారు. ఈ లోగా ఫ్రెంచి పిల్లలకు ఫ్రెంచివారే ప్రపంచంలోకల్లా గొప్పవీరులనీ, ఇంగ్లీషు పిల్లలకు ఇంగ్లీషువారే ప్రపంచంలోకల్లా గొప్పవీరులనీ పాఠాలు చెబుతున్నారు. ప్రతిదేశంలోనూ, స్వదేశచరిత్ర పాఠం చెప్పడానికి పరదేశీయులు వ్రాసిన పుస్తకాలు వాడాలని నేను చాలకాలం క్రితం (అప్పట్లో నా సూచనను ఆమోదిస్తారనే ఆశ లేకపోయినా) సూచించాను. అట్టి పుస్తకాలు తప్పకుండా పక్షపాతంతో వ్రాసినవే అవుతాయి.

కాని, విద్యార్థులలో తద్వ్యతిరేకమైన పక్షపాతం ఉంటుంది కాబట్టి, ఫలితం ఇంచుమించు న్యాయబద్ధంగా ఉంటుంది.

చరిత్ర ఒక్కొక్క కొత్తపద్ధతిలో పాఠం చెప్పవలసింది కాదు. గణితశాస్త్రం తప్ప మిగిలినవన్నీ కూడా మానవుని పురోగమనంలో ఒక భాగంగా, మానవుడు అతిగమించి వచ్చిన. ఇప్పటికీ ఎదుర్కొంటున్న కష్టాల పరంపరలను గుర్తించిన కథగా బోధించాలి. యుద్ధాలకు ప్రాముఖ్యం ఇవ్వడం మానివేస్తే. చరిత్ర నీరసంగా తయారయే ప్రమాదం ఉంది. కాని. యుద్ధం మినహా మిగిలిన సంఘర్షణలలో మానవుని విజయ ప్రయత్నాలను అభివర్ణించడం ద్వారా ఈ చిక్కును పూర్తిగా తొలగించవచ్చు. మానవుడు పరిపూర్ణ వివేకవంతుడు కావడానికి చేసే క్రమప్రయత్నంలో మూడు ప్రధానమైన సంఘర్షణ * లున్నాయని చెప్ప వచ్చును. ఒకటి : ప్రకృతితో తన సంఘర్షణ. రెండు : తనకూ ఇతర మానవులకూ సంఘర్షణ. మూడు : తన ఆత్మ సంఘర్షణ. ఇందులో ప్రతి సంఘర్షణకూ ప్రత్యేకమైన చరిత్ర, ప్రాముఖ్యము ఉన్నాయి. మానవుడు ఆహారం సంపాదించు కొనడంకోసం ప్రయత్నం మొదలు పెట్టిన నాటినుండి ప్రకృతితో సంఘర్షణ ఆరంభమయింది. నేటికీ ప్రకృతిరహస్యాలను తెలుసుకొనడానికీ, ప్రకృతి శక్తులను తనకు ప్రయోజనకరంగా వినియోగించుకొనడానికీ మానవుడు నిరంతరం పోరాడుతూనే ఉన్నాడు. చరిత్రలోకల్లా అత్యంత ప్రధాన

* చూడు : నా "New Hopes for a Changing World."

మైన విజయాలను మానవుడు ఈ రంగంలోనే సాధించాడు. అనతికాలంలోనే మహత్తర విజయాలను సాధించబోతున్నాడు. ప్రకృతిపై మానవుని విజయసంపాదనగాథ అత్యద్భుతావహమైనది. ఇది పిల్లలకు మరీ ఆశ్చర్యజనకంగా ఉంటుంది. బడిలో పాఠాలు చెప్పేటప్పుడుకూడ ఈ కథను ఇంత ఆశ్చర్య జనకంగానూ చేయవచ్చును. ఇంతవరకూ యుద్ధకాంక్షకే తరచు ప్రోద్బలకరమైన సాహసాభిలాషను ఇప్పుడు ప్రకృతి రహస్యాలను భేదించడంకోసం వినియోగింపజేయవచ్చు. అమెరికా, ఆఫ్రికా ఖండాలలోనూ, ధ్రువాల వద్దనూ, హిమాలయ పర్వతాలలోనూ జరిగిన అన్వేషణలను కళ్ళకు కట్టినట్లు సినిమాలలో చూపించవచ్చు. ఇంతవరకూ, నిరాధారమైన పిచ్చి ఊహలకే ఆలవాలమైన అంతరాళయాత్రావకాశాలను. వివేకవంతంగా భాషించి. అయినా అందులో ఆసక్తి ఏమీ తగ్గిపోకుండా చేయవచ్చు. యుద్ధాలు లేకపోయినంతమాత్రాన సాహస ప్రదర్శనకూ, అందువల్ల లభించే కీర్తికీ అవకాశం లేకపోలేదని అత్యంత సాహసోపేతులైన యువకులకుకూడా ఋజువు చేయవచ్చు. ఈ రకమైన పోటీకి అంతు ఉండదు. ప్రతి విజయమూ మరొక విజయానికి నాందిమాత్రమే అవుతుంది.

మనుష్యులకూ మనుష్యులకూ మధ్య ఆయుధాలతో జరిగే సంఘర్షణమాత్రం మంచిదికాదు. మానవజాతి మనగలగాలంటే ఈ రకమైన పోటీ వెంటనే అంతం కావాలని ఏమాత్రం వివేకంతో ఆలోచించినా మనకు వెంటనే బోధపడుతుంది. ఇంతవరకు చరిత్రలో యుద్ధంవలన ప్రయోజన

కరమయిన పని ఏదీ జరగలేదని గాఢమైన విశ్వాసంగల శాంతివాదిలాగ నేను ఈ విషయాన్ని ప్రతిపాదించడం లేదు. పర్వత ప్రాంతాలలో నివసిస్తూండే అనాగరికజాతులు దిగువనున్న పంటపొలాలపై విజృంభించి, నాగరిక నగరాలకు అపార నష్టాన్ని కలిగించినపుడు నాగరిక సైన్యాలు వాళ్ళతో యుద్ధంచేసి జయించినమాట నిజమే. కాని, యిప్పుడు నాగరిక జాతులు ప్రబలసంఖ్యాకులు కావడంవల్లనూ, వారికి నవీన ఆయుధసంపత్తి సమృద్ధంగా ఉండడంవల్లనూ పూర్వం రోమను సామ్రాజ్యాన్ని అనాగరిక జాతులు నాశనం చేయడం లాంటి కథ పునరావృత్తంకాదు. ఇప్పుడు నిజానికి అనాగరిక జాతులవల్ల యుద్ధప్రమాదం లేదు సరికదా, నాగరికతకు అత్యున్నత శిఖరంపై ఉన్నామన్న వారివల్లనే అట్టి ప్రమాదం రాబోతోంది!

పరస్పర స్పర్థను పెంపొందించడమనే పాతకాలపు పద్ధతిని అనుసరించడం మూలంగా, నాగరిక జీవనానికి వృథాగా వాటిల్లబోయే అపాయాలను, శాంతియుత సహజీవనం మూలంగా రాబోయే ప్రయోజనాలను పిల్లలకు కళ్లకు కట్టినట్లు చూపించడం విద్యావిధానం నెరవేర్చవలసిన ముఖ్యకర్తవ్యం.

బాహిరమైన సంఘర్షణలకు తోడు చాల మందిలో ఆంతరంగికమైన ఉద్దేశాలకూ, కోరికలకూ పొందిక కుదరక మరియొక విధమైన సంఘర్షణ కలుగుతుంది. అట్టి సంఘర్షణలను తగ్గించడానికే నైతిక వ్యవస్థలు ఏర్పడినాయి.

మానవ జీవిత పరిస్థితులు మారుతున్నకొద్దీ, నైతిక దృక్ప థంలోకూడ మార్పులు రావాలి. అట్టి మార్పులలో ఇప్పుడు అవసరమైన మార్పు ఒకటి ఉంది. ప్రతిమనిషీ – తనవారు కానివారందరినీ తనకు ప్రత్యర్థులుగా భావించకుండా, తనకు సహకారులుగా భావించాలి. ఈ విషయం ఇక్కడ సంపూర్ణంగా వివరించాలంటే చాల పెద్దదయి. ప్రస్తుత ప్రధాన విషయాన్ని మించిపోతుంది.

విద్యావిధానంలో కూడా – ఇతర వ్యవహార రంగా లన్నిటిలో లాగ – ప్రపంచానికి అత్యంత ముఖ్యంగా కావల సింది ఒకటే. భయానికి బదులు ఆశను ఉద్దీప్తం చేయడమూ, మానవ కుటుంబం సహకారభావంతో తనలోని ఉత్తమ శక్తులను గ్రహించుకోగలిగితే జీవితం ఎంత బ్రహ్మాండమయిన దవుతుందో తెలియపరచడమూ.

అనుబంధం : ఒకటి

# ఏకపక్ష నిరాయుధీకరణ

కొన్ని పరిస్థితులలో ప్రాచ్య రాజ్యాలుకాని, పశ్చిమ రాజ్యాలు కాని రెండవ వారితో సంబంధం లేకుండా తామై అయుధాలను విసర్జించడం మంచిదేనని నేను అన్నానని కొందరు ప్రత్యేకంగా విమర్శించారు. నేను చెప్పిన షరతులు మరచిపోయి, ఆయుధాలు విసర్జించమన్న మాట కేవలం పశ్చిమ రాజ్యాలకే చెందుతుందనీ, తూర్పు రాజ్యాలకు చెందదనీ వా రనుకున్నారు. ఇందుకు ఆ విమర్శకులను మాత్రమే నిందించి ప్రయోజనంలేదు. కేవలం తాత్త్విక చర్చ మాత్రమే చేయదగిన విషయాన్ని ఆచరణ సాధ్యమైన చర్యలాగా నేను చర్చించేటట్లు చేశారు కొందరు. రష్యాగాని, అమెరికాగాని, ఒక్కటే ఆయుధాలు విసర్జిస్తుందని ఎవరూ అనుకోరు. అందుచేత ఎవరైనా ఆపని చేస్తారా అనేది కేవలం నీతి శాస్త్ర చర్చయే కాని యింకేమీ కాదు. ఆచరణ రీత్యా ఆలోచిస్తే నేను చెప్పేమాట యిది : తూర్పు పశ్చిమ రాజ్యాల మధ్య వైమనస్యాలు తగ్గి, వివాదాస్పద విషయాలపై చర్చలు జరిగి, ఉభయ పక్షాలలో ఎవరికీ అధికతర ప్రయోజనం రాకుండా ఉండే పద్ధతిపై ఒడంబడిక కుదుర్చుకోవాలి. అట్టి ఒడంబడిక సంతృప్తికరంగా ఉండాలంటే ఉభయులూ అణ్వాయుధాలను విసర్జించడం, తగినంత పర్యవేక్షణకు అవకాశం ఉండడం అవసరం. రష్యా, అమెరికాలు మినహాయించి మిగతా రాజ్యాలు ఏవీ హైడ్రోజన్ బాంబులు తయారు చేసే ప్రయత్నాలు చేయకూడదనీ బ్రిటన్ హైడ్రోజన్ బాంబులు తయారుచేసే ప్రయత్నాలు విరమించాలనీ నే నన్నమాట నిజమే. బ్రిటన్ ఒక్కటే అణ్వాయుధాలను విసర్జించినంత మాత్రాన ప్రాక్పశ్చిమ పక్షాల బలాబలాలలో చెప్పుకోదగ్గ మార్పు వస్తుందని నే ననుకోను. పైగా ఎక్కువ రాజ్యాలకు అణ్వాయుధాలు లభ్యమవుతున్న కొలదీ యుద్ధ ప్రమాదం హెచ్చుతూఉంటుంది. అందుచేత బ్రిటన్ హైడ్రోజన్ బాంబులను విసర్జించాలన్న విషయానికీ, ప్రధాన

వైరివర్గాలకు నాయకులయిన రష్యా, అమెరికాలలో ఏదో ఒకటి తమంతట తాము అణ్వాయుధాలను విసర్జించాలన్న విషయానికీ సంబంధం లేదని తేలుతున్నది. పరిష్కారానికి చేసిన అన్ని ప్రయత్నాలూ విఫలమయినప్పుడే నాకూ, నన్ను విమర్శించేవారికీ వివాదాస్పదమైన ప్రశ్న ఉదయిస్తుంది. తక్షణం అన్ని రకాల అణ్వాయుధాలూ విసర్జించమని అమెరికా ప్రభుత్వాన్ని కోరాననీ, రష్యా విషయంలో అట్టి కోరిక నాకు లేదనీ నన్ను విమర్శించేవారు భావిస్తున్నారు. ఆదర్శాల మాట ఎలా ఉన్నా, యీ ప్రశ్న చాలా అవాస్తవిక మయినది. ఏ పక్షమూ రెండవ పక్షానికి తానై పూర్తిగా లొంగిపోదు. అయినా ఈ ప్రశ్న ప్రధానమైన దనుకుంటున్నారు కాబట్టి నా అభిప్రాయాన్ని స్పష్టంగా పునఃప్రకటిస్తాను.

ఆవేశాలు లేకుండా చేయడానికి, ఇప్పుడున్న రెండు వైరి వర్గాలకూ ఒకదానికి 'ఏ' అని, యింకొక దానికి 'బి' అని పేరు పెడతాను, ఇందులో ఏది కమ్యూనిస్టు వర్గమో, ఏది కమ్యూనిస్టు వ్యతిరేకవర్గమో చెప్పను. ఈ రెండు వర్గాల మధ్య యుద్ధమేవస్తే—మానవజాతి పూర్తిగా తుడిచిపెట్టుకుపోతుందనే అభిప్రాయంతో ఈ వాదం మొదలు పెడతాను. ఇంతేగాక, ఈ రెండింటిలో ఒకవర్గం వెర్రి ఆవేశంతో—రెండవ వర్గంతో రాజీపడడంకన్న మానవజాతి అంతం అయిపోవడమే మంచిదని భావిస్తోందని అనుకుందాం. అలాంటి పరిస్థితులలో కొంచెం తక్కువ పట్టుదలగల రెండవ వర్గం మానవజాతి క్షేమాన్నే కోరితే, సర్వ వినాశకర యుద్ధంకన్నా, యెంతవరకూ నయినాసరే తల ఒగ్గడమే మంచిదనుకుంటుంది. ఈ మాట రెండు వర్గాలకూ సమానంగానే వర్తిస్తుంది. ఇరుపక్షాలలో కూడా మానవులు మొత్తం నాశనం అయినా సరే, శత్రువులకు జయం లభించనీయకూడదనుకునే వారున్నారు. ఇట్టి వారు 'ఏ' వర్గంలో ఉన్నా, 'బి' వర్గంలో ఉన్నా, నా దృష్టిలో పిచ్చివాళ్ళ కిందే లెక్క. పశ్చిమ రాజ్యాలలో నన్ను విమర్శించేవారూ, ప్రాచ్యపక్షంలో క్రుశ్చేవ్ ను బలపరిచే వారిలో కొందరూ—ఒక పక్షంవారు ఏది చెప్పినా అంగీకరించి ఆ విషయమే రెండవవారు చెప్పితే ఒప్పుకోరు. అణుయుద్ధంలో చిక్కుకోవడంకన్నా శత్రువుకు తల ఒగ్గడమే మంచిదని నేను చెప్పిన మాట ఉభయ పక్షాలకూ చెప్పి

నదేకాని, ఏ ఒక్కరికీ ప్రత్యేకంగా ఉద్దేశించినది కాదు. గట్టిగా బలవంత పెడితే లొంగిపోతారని, శత్రువులకు నుండే తెలిస్తే రాయ బారాలలో పరాజయం తథ్యం అవుతుందని నాకు తెలుసు. 'ఏ' వర్గానికిగాని, 'బి' వర్గానికిగాని నేను ప్రభుత్వాధిపతి నయిఉంటే అట్టి ప్రకటన చెయ్యను. కాని పూర్తిగా నిరాశాకర పరిస్థితి యేర్పడితే యేమి చెయ్యాలనే విషయంపై కేవల తాత్త్విక చర్చ చెయ్యడానికీ దీనికీ ఏమీ సంబంధం లేదు. ఎంత నష్టానికయినా తలపడి అణు యుద్ధాన్ని తప్పించుకోవాలనే అభిప్రాయం రెండు వర్గాలకూ ఉండాలని చెప్తున్నాను. నేను ప్రకటించిన భావం ఏదో ఒక పక్షానికే ఎక్కువగా వర్తిస్తుందనడం పూర్తిగా అన్యాయం. నా భావాలు ఉభయ పక్షాల వారికీ సమానంగా వర్తించాలనే ప్రకటించాను. వాటికి ఇటు అమెరికాలోనూ, అటు కమ్యూనిస్టు దేశాలలోనూ సమాన ప్రచారమే లభించింది.

నా భావాలలో కొన్ని మాత్రమే చెప్పిన ఒక ఇంటర్వ్యూ పత్రికలలో ప్రకటింపబడినందువలన కాబోలు - కొందరిలో ఏర్పడిన దురభిప్రాయాన్ని తొలగించడం అవసరం. ప్రాక్పశ్చిమ రాజ్యాల నాయకులు వివేకంతో వ్యవహరిస్తే అణు యుద్ధాన్నీ, శత్రువుకు లొంగిపోవలసిన అగత్యాన్నీ - రెండింటినీ తప్పించుకోవడం కష్టం కాదు. కృతకమయిన తార్కిక యుక్తులు ఆధారంగా కాక, ఆచరణరీత్యా నేను కోరేది ఒకటే. ఉభయపక్షాలూ యుద్ధం సర్వవినాశకమనీ, నిష్ప్రయోజకమనీ, సహజీవనం తప్పదనీ ప్రకటించాలి.

నన్ను విమర్శించేవారు చాలామంది యితరుల స్వేచ్ఛను మన్నిస్తామని చెప్పుకుంటున్నా, ఈ విషయంలో మాత్రం ఆత్మవంచన చేసుకుంటున్నారు. కమ్యూనిస్టు రాజ్యమయినా, కేపిటలిస్టు రాజ్యమయినా సరే, సర్వనాశనం కంటే మంచిదేనని అనుకునే వారికి-వారి యిష్టం వచ్చినట్లు చేసుకునే హక్కు ఉన్నదని వీరు గుర్తించడం

లేదు. కమ్యూనిస్టురాజ్యాల పౌరులకు, కేపిటలిస్టు రాజ్యాల పౌరులకు మాత్రమే కాక, తటస్థరాజ్యాల పౌరులకు కూడా ఇప్పుడు ఉన్న ప్రాథమిక స్వాతంత్ర్యాన్ని—జీవించాలని కోరుకునే హక్కును—వీరు నిరాకరిస్తున్నారు. కమ్యూనిజంకన్నా ప్రపంచం నాశనం కావడమే మంచిది, లేక కేపిటలిజంకన్నా ప్రపంచ నాశనం కావడమే మంచిది. అనే అభిప్రాయాలు తప్పు—అని వాదనలవల్ల రుజువు చేయడం కష్టం కావచ్చు. కాని, అట్టి అభిప్రాయాలున్నవారు, ఆ భావాలను విశ్వసించని వారినికూడ బలవంతాన నశింపజేయడానికి వీరికి హక్కున్నదేమో పరీక్షించుకోవడం అవసరం. మానవ ప్రపంచ చరిత్రలో మతం పేరుతో కూడా, యింతవరకూ ఎన్నడూ యింత ఘోరమయిన పరపీడన జరుగ లేదు.

అనుబంధం : రెండు

# నిలకడలేనితనం!

నేను అణుయుద్ధానికి వ్యతిరేకంగా చేస్తున్న ప్రచారానికి వ్యతిరేకులయినవారు—నా వాదనలను ప్రతిఘటించడానికి పదేళ్ళక్రితం నేను చెప్పిన మాటల నుపయోగించుకొని నాకు నిలకడ లేదని ఆరోపిస్తున్నారు. ఈ విషయాన్ని వివరించి పూర్తిగా సందేహ నివృత్తి చేయడం నా ధర్మం. ఒకప్పుడు—ఒక్క అమెరికా దేశానికే అణ్వాయుధాలున్నప్పుడు—అమెరికా ప్రభుత్వం అణుశక్తిని సర్వోపయోగాలను అంతర్జాతీయం చెయ్యడానికి "బరూచ్ ప్రతిపాదనలు" అనబడే ప్రతిపాదనలు చేస్తున్నప్పుడు—అమెరికా చేసే ప్రతిపాదనలు చాలా వివేకవంతమయినవని, ఉదారమయినవని నేనన్నాను. బరూచ్‌పథకాన్ని అంతా అంగీకరించినట్లయితే అణ్వాయుధాలకోసం జరగబోయే పోటీ తప్పుతుందనీ, అందువల్ల ఎంతో సుఖపడతామనీ నాకనిపించింది. అణ్వాయుధాలు తయారుచెయ్యడంలో బలవంతులు పోటీ పడటంవల్ల ఘోరనష్టాలు వస్తాయని పశ్చిమరాజ్యాలలోని విజ్ఞులకు అప్పటికే విదితమయింది. బరూచ్ పథకంవలన రష్యాకు అంతా లాభమేకాని నష్టం ఏమీ లేదు; అందువలన రష్యా యీ పథకాన్ని ఆమోదిస్తుందని కొన్ని రోజులపాటు భావించాను. కాని దురదృష్టవశాత్తు స్టాలిన్‌కు స్వభావసిద్ధమైన అనుమానంవలన, ఇందులో ఏదో మోసం ఉందని శంకించి, రష్యా సొంతంగా అణుబాంబులు చేసుకోవాలని అతడు నిశ్చయించాడు. రష్యాను ఒత్తిడిపెట్టి, అణుశక్తిని అంతర్జాతీయం చేయడమనే ఒక్క సమస్యకోసం, అవసరమయితే, యుద్ధం చేస్తామని భయపెట్టడమయినా మంచిదేనని అప్పుడు నేను భావించాను. అప్పుడూ, యిప్పుడూ నా లక్ష్యం—ప్రపంచాన్ని సర్వనాశనం చేయగల శక్తిగల రెండు పక్షాలు పోరాడుకునే పరిస్థితి రాకుండా ఉండాలనేదే. కాని అప్పుడు పశ్చిమ రాజ్యాల నాయకులు తమ అగ్రత్వం ఎన్నటికీ తగ్గదనీ, రష్యా అణ్వాయుధాలలో ఎన్నటికీ తమతో సమాన

స్థాయికి రాలేదని విశ్వసించారు. ఈ విశ్వాసం తప్పు అని తరువాత ఋజువయింది. ఇప్పుడు అణుయుద్ధం రాకుండా ఆపాలంటే కొత్తమార్గాలననుసరించాలి గాని, పదేళ్ళ క్రితం అనుసరించిన పద్ధతులు పనికిరావు.

ఒకసారి ఒక విధానాన్ని అనుసరిస్తే - పరిస్థితులన్నీ మారిపోయిన తరువాత కూడా ఆ విధానాన్నే పట్టుకొని ప్రాకులాడాలని - నన్ను విమర్శించేవారి అభిప్రాయంలా ఉంది. ఒక వ్యక్తి ఒక ఊరు పోవాలని రైలెక్కి బయలుదేరగా, మధ్యదారిలో రైలు ఇంజను చెడిపోయిందనుకోండి. అతను రైలుదిగి, ఇంకొకదారిని ఆ ప్రయాణం చేసుకోవడం నిలకడలేనితనమని నిందిస్తామా? ఈ విధంగానే ఒక విధమైన పరిస్థితులలో ఒక విధానాన్ననుసరించినా, ఆ పరిస్థితులు మారిపోయిన తరువాత ఇంకొక విధానాన్ననుసరించవలసి వస్తుంది.

నేను ఎన్నడూ కేవలం శాంతివాదిని కాను. యుద్ధం అసలే పనికిరాదని ఎన్నడూ నేను వాదించలేదు. కొన్ని యుద్ధాలు అవసరమైనవి; కొన్ని కావు అని, అందరు వివేకవంతులూ అనుకున్నట్లుగానే, నేనూ అనుకున్నాను. ఇప్పుడు ఏర్పడిన ప్రత్యేక పరిస్థితి యేమిటంటే — పెద్దయుద్ధమే గాని వస్తే, పరస్పరం పోరాడుకునే వారుభయులూ, తటస్థులూ — మొత్తం అంతా నశించిపోతారు. ఈ పరిస్థితి చాలా అపూర్వమైనది. యుద్ధం ఏ ప్రయోజన సాధనానికీ ఉపయోగపడదని దీనివలన స్పష్టపడుతున్నది. ఇప్పటికీ - యుద్ధం చేస్తామని శత్రువులను బెదిరించవచ్చునన్న మాట నిజమే. కాని, ఆ పని ఉన్మత్తులొక్కరికే తగును. దురదృష్టవశాత్తు, కొందరు నిజంగా ఉన్మత్తులు. కొద్దికాలం క్రితమే ఒక పెద్దరాజ్యానికి ఉన్మత్తులు అధిపతులుగా ఉండేవారు. ఇలాంటిది మళ్ళీ జరగదని హామీ లేదు. ఒకవేళ జరిగితే — హిట్లరు చేసిన భయానక యుద్ధం అత్యల్పంగా కనిపించేటంత ఘోరమైన మారణహోమం సంభవిస్తుంది. ప్రపంచమంతా ఇప్పుడు అసిధారమీద నడుస్తున్నట్లుంది. ఈ నిరంతర అస్థిరత్వంపోయి శాశ్వత సుస్థిరత్వం సాధించడానికి కొత్తపద్ధతులు అవసరం. ఇట్టి క్రొత్తపద్ధతులే ప్రాక్ పశ్చిమ రాజ్యాలవారనుసరించాలని నాబోటివారంతా పట్టుబడుతున్నారు.

నా అభిప్రాయాలు కాలక్రమాన మార్పులు చెందినవని నేనంగీకరిస్తున్నాను. కాని, అవి పరిస్థితుల కనుగుణంగా మారినవి. తమ లక్ష్యాన్ని సాధించడానికి వివేకవంతులు పరిస్థితుల కనుగుణమైన విధానాల ననుసరిస్తారు. అలా అనుసరించనివారు అవివేకులు.

నాకు నిలకడ లేదన్న విషయం నే నంగీకరించక పోయినా, నా మనఃస్థితీ, భావనలూ, కేవలం వ్యవహారదృష్ట్యా అవసరమైన దానికన్నా గాఢంగా మార్పులు చెందాయని నేను ఒప్పుకోనక పోతే—నేను పూర్తిగా నిజంచెప్పినట్లు అవదు. రాబోయే యుద్ధంలోనో, తప్పితే తరువాతనో, ఆ తరువాతనో వచ్చేయుద్ధంలో మానవజాతి సమూలంగా నాశనం అయిపోతుందనే భయంకర విషయం తలచుకుని, దానిని గురించి తీవ్రంగా ఆలోచించిన ఏ వ్యక్తికైనా—కేవలం అంతర్జాతీయ బాంధవ్యాలను గురించే కాక, అసలు మానవ జీవితాను, దాని సంస్కారాలను గురించే, సమూలంగా నూతన విధానంలో యోచించవలసిన ఆగత్యం బోధపడక తప్పదు. మీరూ మీ మిత్రుడూ ఒక ప్రధాన సమస్యను గురించి తీవ్రంగా వాదం చేస్తుండగా—మిమ్మల్ని ఉభయుల్నీ, మీ ప్రాంతాన్ని కూడా సర్వనాశనంచేసే పెనుతుఫాను వస్తే—మీరు మీ వివాదం మాటే మరచిపోతారు. సర్వప్రపంచాన్ని నాశనం చెయ్యబోతున్న పెనుతుఫాను రాబోతోందని మానవజాతి గుర్తించేటట్లుచేసి—విభేదకారణమైన వివాదాన్ని మరచిపోయేటట్లు చేయడమే ఇప్పుడు ప్రధాన కర్తవ్యం. కమ్యూనిజంలోనో, కేపిటలిజంలోనో ఉన్న చెడుగుని గురించి, ఎన్నో సంవత్సరాల పాటు, వాదనాపటిమనంతా ధారపోసిన తరువాత—ఆ సమస్య అంత ప్రధానమైనది కాదని గుర్తించడం కష్టమని నాకు తెలుసు. కాని, ఎంతకష్టమైనా, కమ్యూనిస్టు పాలకులూ, పశ్చిమ రాజ్యాల రాజనీతి నిర్ణేతలూ ఈ విషయాన్ని గుర్తిస్తే తప్ప—మానవజాతికి మనుగడలేదు. వారు దానిని గుర్తించేటట్లు చేయడమే—నా ప్రస్తుత వాదనలకు లక్ష్యం.

కళ్ళుమూసుకొని నిప్పుగుండంలో తలక్రిందులుగా దూకబోతున్న ప్రపంచాన్ని "ఆగు, ఆగు"మని గట్టిగా రస్సెల్ వేసిన కేక—ఈపుస్తకం...

తోడి మానవుణ్ణి శత్రువనుకొని వాణ్ణి సమూలనాశనం చేయాలనే గుడ్డి ఆవేశంతో తానూ నాశనమయిపోయే ప్రమాదాన్నికూడ చూడగలిగిన వివేకం కోల్పోయినవారి కళ్ళు తెరవడానికి రస్సెల్ చూపిన దీపం ఈ పుస్తకం...